# మానసరోవర్

( సీత - పద్మ లేఖలు )

మూలం :

ఉపన్యాస సామ్రాట్ : ప్రేమ్‌చంద్

అనువాదం :

జ్యోశ్యుల సూర్యనారాయణమూర్తి

పబ్లిషర్సు :

మారుతిరామా అండ్ కో., విజయవాడ.

విద్యావిషయక ప్రచారకులు

సర్వస్వామ్యములు
ప్రకాశకులవి

ప్రథమ ముద్రణము
1954

వెల :
రూపాయి పావలా

# కృతజ్ఞత

తన తండ్రిగారి కథలైన 'దో సఖియాఁ', 'సవా సేర్ గేహూఁ', 'సద్గతి' అను రచనలు తెలుగులో అనువాదం చేసికొనుటకు నాకనుమతినిచ్చిన 'శ్రీపత్ రాయ్'గారికి కృతజ్ఞుడను. ప్రస్తుతమివి ముద్రించితిమి. తర్వాత మిగిలినవి రాగలవు.

— అనువాదకుడు.

జయ కార్తిక శుద్ధ ఏకాదశి.

విజయవాడ
వైశ్యరత్న ప్రింటింగు వర్క్సునందు
ముద్రింపఁబడియె.

# మానసరోవర్

( సీత - పద్మ లేఖలు )

## 1

లక్నో, 1-7-25.

ప్రియ సోదరీ !

నే నిక్కడికి వచ్చినప్పటినుంచీ నీ సంగతే జ్ఞాపకం వస్తోంది. నువ్వు వచ్చి యిక్కడ కొన్నాళ్ళుంటే ఎంత బాగుంటుంది! నీకు నా 'వినోద్'తో పరిచయం చేస్తును. ఇది సంభవంకాదూ! మీ అమ్మా, నాన్నా నీకీ మాత్రం స్వాతంత్ర్యం ఇవ్వరూ! సంకెళ్ళు తగిలించుకుని నీ వెల్లా ఉండగల్గుతున్నావా అని నా కాశ్చర్యం గలుగుతోంది. నేను మాత్ర మల్లాగ ఒక గంటైనా ఉండలేను. దైవకృపవల్ల మా నాన్నగారు పూర్వాచార పరాయణులు కారు. నారీజీవనాన్ని స్వర్గతుల్యం చేయాలనుకొనే వాళ్ళలోవారే మా నాన్నగారు. ఆయన నవీనాదర్శాలకి భక్తుడు. లేకపోతే నే నెందుకూ పనికిరాకుండా పోయేదాన్ని.

వినోద్ ఈ మధ్యనే 'డి.ఫిల్' పూర్తిచేసుకొని ఇంగ్లండు నుంచి తిరిగివచ్చారు. జీవయాత్ర ప్రారంభించక మునుపే ఒక సారి ప్రపంచయాత్ర ప్రారంభించా లనుకొంటున్నారు. యూరొపులో చాలాభాగం ఆయన చూసేసిందే. కాని అమెరికా, ఆస్ట్రేలియా, ఆసియా తిరిగిరాందే ఆయనకు తృప్తి లేదు.

మధ్య ఆసియా, చైనాదేశాలను గురించి స్పెషల్‌గా 'స్టడీ' చేయాలనుకొంటున్నారు. యూరప్ యాత్రికులు పరిశోధించి కనుక్కోలేని విషయాలమీద శ్రద్ధ తీసుకోవటం ఈయనకి ధ్యేయం. సీతా! నిజం చెప్తున్నాను. ఇంత సాహసి, ఇంత ధీరుడు, ఇంత ఆదర్శవాది నిజంగా నా కెక్కడా కనిపించలేదు. ఆయన మాటలు నాకు చాల ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. ఆయనకు నిష్కర్షగా తెలియని సంగతంటూ ఉండదు ఆయన విమర్శించలేనిది లేదు. ఆ విమర్శకూడా పుస్తకాల్లో విమర్శ కాదు. అందులో స్వాతంత్ర్యమూ, నవీనతా ఉంటాయి. స్వాతంత్ర్యాని కీయన సాటిలేని ఉపాసకుడు. ఇటువంటి పురుషునికి భార్యనైయుండి తన సౌభాగ్యానికి గర్వించని స్త్రీ వుంటుందా?

చెల్లీ సీతా! ఏం చెప్పను! ఆయన ఉదయం తన బంగాళాలోకి వస్తూవుంటే ఆయన్ని చూట్టానికి నామనస్సెలా ఉంటుందనీ? ఆయనకు సర్వము సమర్పింపబడాలని త్వరపడుతూ ఉంటుంది. కాబట్టి ఆయన నా ఆత్మలో ప్రవేశించి ఉండిపోయారు. నిజంగా నే నాశించిన పురుషుడే అనుకో. అయినా నాలో ఆయన కేం తప్పు కనిపిస్తుందో అని నా కహర్నిశలు భయం కలుగుతూనే ఉంటుంది. ఆయన కిష్టమైన విషయాలను గురించే అర్ధరాత్రిదాకా చదువుతూ కూర్చుంటున్నాను. ఇంత పరిశ్రమ నే నెప్పుడూ చేయనే లేదు. అద్దం, దువ్వెన అంటే ఇంత మక్కువ నా కెప్పుడూ లేదు. సుభాషితా లింత పట్టుదలగా నే నెప్పుడూ కంఠస్థం చేయలేదు. ఇంతచేశాకకూడా నే నాయన హృదయాన్ని

చూరగొనలేకపోతే, చెల్లీ! నా జీవితం నష్టమైపోతుంది. హృదయం విశీర్ణమవుతుంది. నాకీ ప్రపంచమే శూన్యమౌతుంది.

అప్పుడప్పుడు మనస్సులో ప్రేమతోపాటు ఈర్ష్యాభావం కూడ కలుగుతోంది. ఆయన మా బంగాళాకేసి వస్తోన్నప్పుడు మా పొరుగింటి కుసుమ తన వసారాలో నిలబడుతుంది. అప్పుడు నాకు 'దాని కళ్ళుపోతే బాగుండు'ననిపిస్తుంది. నిన్న ఎంత పని జరిగిందనుకొన్నావు! వినోద్ దాన్ని చూడగానే 'హ్యాట్' తీసి నవ్వాడు. ఆ కులట కూడా ముసిముసినవ్వులు ప్రారంభించింది. దేవు డెన్ని ఆపదలైనా కలిగించవచ్చు గాని దురభిమానం మాత్రం ఇవ్వకూడదు —

దాని రూపం చూస్తే పిశాచంలా ఉంటుంది. కాని తానే అప్సరస ననుకొంటుంది. కవిత్వంకూడ అల్లుతుంది. ఆ కవిత్వాన్ని కొన్ని పత్రికలు ప్రచురించాయి. అంతే, ఇంక నేలమీద నిలవడదు. నేను నిజం చెబుతున్నాను. కాస్సేపటి దాకా వినోద్ మీద నాకున్న శ్రద్ధ అంతా పోయింది. ఒకసారి వెళ్ళి కుసుమ ముఖం వాచేలాగ చీవాట్లు పెడదామను కొన్నాను. అప్పుడంత ఆవేశం వచ్చింది. అదీ మొసగే! ఇద్దరూ మాట్లాడుకోలేదు. కాని వినోద్ వచ్చి కూర్చున్నాక అరగంటదాకా ఆయనతో మాట్లాడలేకపోయాను. ఆయన మాటల్లో ఆ పసగే లేదు. నా కిలో మాధుర్యమే లేదు. అప్పటినుంచీ నా మనస్సుకి శాంతి కలగలేదు. రాత్రి తెల్లవార్లు నిద్రపట్టలేదు. ఆ దృశ్యమే అస్తమానమూ కళ్ళకి కని

పిస్తూ వచ్చింది. కుసుమను సిగ్గుపరచాలని ఎన్నో ఆలోచనలు చేశాను. సీతా! నా మనస్సింత దుర్బలమైనదని నాకీ వేళ దాకా తెలియదు. వినోద్ నన్ను 'తేలికమనిష'నుకొంటా రేమో అనే భయమే లేకపోతే నేనాయనతో స్పష్టంగా నా మనోభావాలు చెప్పేదాన్ని. నేను సంపూర్ణంగా ఆయన దాననై ఆయన్ని నా వాణ్నిగా చేసుకోవాలనుకొంటూను. ప్రపంచంలో అందరికంటె రూపవంతుడు నా ముందుకు వచ్చినా నేనతన్ని కన్నెత్తిచూడనని నాకు విశ్వాసంవుంది. వినోద్ మనస్సులో నాపై యీ భావం ఎందుకుండకూడదు?

సీతా, నెచ్చెలీ! ఒక వారంరోజు లుండేలాగ ఇక్కడికిరా. నిన్ను కలుసుకోవాలని నా మనస్సు త్వరపడుతోంది. నాకీ సమయంలో నీ సలహా, సానుభూతి చాల అవసరం. ఇది నా జీవితంలో ప్రమాద సమయం. ఈ పదిహేనురోజులలో స్వర్గ మైనా కావాలి; మట్టైనా అవాలి. ఇదుగో ఏడుగంటలైంది. ఇంకా తల దువ్వుకోలేదు. వినోద్ వచ్చేవేళమైంది. ఇంకె సెలవు. మళ్ళీ ఆ దిక్కుమాలిన కుసుమ నవారాలొలికి వచ్చి నిల్చుంటుందేమో! నిన్న ఏదో సరళభావంతో ఆ నవ్వులు జరిగా యనుకొని మనస్సు సమాధానపరచుకొన్నాను. ఈ వేళ కూడా ఆ దృశ్యం కనిపిస్తే అంత తేలికగా మనస్సుని ఒప్పించు కోగలనా?

సి పద్మ



# 2

గోరక్‌పూర్, 5-7-25.

ప్రియ పద్మా !

ఒక యుగానికి నీకు నా సంగతి గుర్తువచ్చింది. నీ వేమయ్యావో అనుకొన్నాను. కుసుమ నీ నిష్ఠురత్వానికి తగిన శిక్ష నీకు విధిస్తోంది—15వ ఏప్రిలున కాలేజి మూశారు. 1వ జూలైని తమ ఉత్తరం వ్రాస్తున్నారు. నిండా 2½ నెలల తర్వాత. అదేనా కుసుమ పయిపల్ల. నీవు నిందిస్తున్న కుసుమనే నేనాశీర్వదిస్తున్నాను. ఆమె దారుణముఖంలాగ నీ దాని కష్టం తగలకపోతే నీకు నా సంగతెందుకు జ్ఞాపకంవస్తుంది? సరే; వినోదని గురించి నీవు చిత్రించినది చాలా ఆకర్షణీయంగా ఉంది. నాకు మరదిగారిని చూచే రోజులు రప్పించమని దేవుణ్ణి పదేపదే ప్రార్థిస్తున్నాను, కాని చూడు, సివిల్ మ్యారేజి చేసుకు కూర్చోకు. వివాహం హిందూపద్ధతి ప్రకారమే జరగనియి. ఆం, వ్యర్థవాదాలు వంద ఉన్నాయని నాకు తెలుసు. నీవు వాటిని తొలగించగలవు. ఒక సరియైన పండితుణ్ణి పిలిపించు. అతి దండుగముక్క నీ దగ్గర డబ్బులు పడకటానికి కాదు; అంతా యథావిధిగా జరిపించటానికి.

సరే, ఇంక నా సంగతి అడుగు. ఇన్నాళ్ళదాకా నీ వెందుకు మాట్లాడక ఊరుకొన్నావంటావా? మా కుటుంబంలో ఈ రెండున్నర నెలలలోను ఐదు పెళ్ళిళ్ళయ్యాయి. వందమందికంటె తక్కువ చుట్టాలున్న రోజొక్కటిలేదు. పెళ్ళి

వారు వచ్చినప్పుడు అంతా 500 మంది అయ్యేవారు. ఈ అయిదుగు రాడపిల్లలు నాకంటె చిన్నవాళ్ళు. నా యిష్టమే సాగితే ఇంకా మూడు నాలుగేళ్ళవఱకు మాట్లాడనిచ్చేదాన్ని కాను. కాని నా మాట వినేదెవరు ? అయినా ఆలోచించగా ఒక సంగతి తోస్తోంది. తల్లిదండ్రులు ఆడపిల్లల పెళ్ళిళ్ళకోసం తొందరపడట మేమీ అనుచితంకాదు. జీవితాలు నమ్మరానివి. తల్లిదండ్రులు అకాలంలో మరణిస్తే ఆడపిల్ల పెళ్ళి ఎవరు చేస్తారు ? సోదరులమాట నమ్మకమేమిటి ? తండ్రి కావలసిన డబ్బిచ్చిపోతే ఏమీ పరవాలేదు. కాని సాధారణంగా జరుగుతూ ఉన్నట్లు ఋణమే యిచ్చిపోతే, సోదరి సోదరులకు భారమే అవుతుంది. ఇదికూడా హిందువుల కితరాచారాల లాగే ఆర్థిక సమస్యమీద ఆధారపడివుంది. మఱి ఆర్థికదశ బాగుపడేటంతవఱకు ఈ ఆచారం నశించదు.

ఇంక నా ఆత్మబలిదానం గుఱించి. నేటికి 15 వ నాడు ఈ యిల్లు నాకు పరాయి యిల్లవుతుంది. రెండు మూడేసి నెలలు వచ్చి ఉన్నా అతిథిలాగే. నా వినోద్ కాశీవాసి; 'లా' చదువుతున్నారు. ఆయన తండ్రి పేరుపొందిన వకీలు. కొన్ని ఊళ్ళున్నాయట. చాలా యిళ్లున్నాయి. మంచి మర్యాదకలవారని విన్నాను. నేనింకా వరుణ్ణి చూడలేదు ! 'చూడాలని ఉంటే వరుణ్ణి పిలిపిస్తా'నని మా నాన్నగారు 'పిలిపించమన్నావా' అని అడిగించారు నన్ను. కాని నేనే అవసరం లేదని చెప్పాను. ఇంటికి వచ్చే కోడలా ఏమన్నానా? అదృష్టాన్ని బట్టి ఉంటుందిలే. నాన్నగారైనా ఎవరి మనస్సులోనూ దూరలేరు. నేనైనా అంతే ! ఒకటి రెండు సార్లు చూచినా, పోనీ కలుసు

కున్నా, మేమిద్దరం ఒకరి నొకరం గుర్తించుకోగలమా? ఇది ఎల్లాగూ సంభవం కాదు. మహా అయితే ఒకళ్ళరూపం ఒకళ్లం చూచుకోగలుగుతాం. ఈ విషయంలో నాన్నగారికి నాకంటె ఎక్కువ తెలుసునని నా నమ్మకం; మా బావలిద్దరూ అందాల బొమ్మలు కాదుగాని ఏ రమణీ వారిని ద్వేషించదు. మా అక్కలు వారితో ఆనందంగా జీవితం గడుపుతున్నారు. అయినప్పుడు నాన్నగారు నాకన్యాయం ఎందుకు చేస్తారు? మన సంఘంలో కొందరి వైవాహిక జీవనం సుఖకరంగా లేదన్న మాట నేను ఒప్పుకుంటాను. కాని ప్రపంచములో దుఃఖిత పరివారంలేని సంఘమేది? పైగా ఎల్లప్పుడూ పురుషులదే దోషం కాదు. బహువిధాల స్త్రీలే విషగుళికలవుతున్నారు.

నేను వివాహాన్ని సేవాత్యాగవ్రతంగా అర్థం చేసుకొంటున్నాను. ఈ భావంతోనే దాని కభివాదనం చేస్తున్నాను. ఆఁ, నేను నిన్ను వినోద్‌నుంచి ఇవతలకి లాగాలనుకోవటం లేదుకాని 20 వ జూలై నాటికి నువ్వు రెండురోజు లిక్కడుండేలాగ, రాగలిగితే వచ్చి నన్ను బ్రతికించు. ఆ వ్రతం దగ్గఱకి వచ్చినకొద్దీ నా మనస్సుకు తెలియని శంకలు కలుగుతున్నాయి. కాని నీ మట్టుకు నీవు జబ్బుపడి ఉన్నావు. నాకేం మందిస్తావు? అక్కా, తప్పక రా సుమా!

నీ సీత.



# 3

మంసూరీ, 5-8-25.

ప్రియ సీతా!

వ్రాయవలసినవి వందలున్నాయి. ఏ క్రమంలో ప్రారంభించాలో తెలియటంలేదు. అన్నిటికంటె ముందుగా నీ వివాహ శుభసమయానికి రాలేకపోయినందుకు క్షమాపణ గోరుతున్నాను. నేను రావాలని నిశ్చయించుకున్నాను. నెచ్చెలి సీత పెండ్లి; నేను వెళ్ళకపోవటమూనా! కాని దానికి సరిగా మూడు రోజులుముందే వినోద్ ఆత్మసమర్పణచేసి నన్ను ముగ్ధురాలిని చేశాడు. మళ్ళీ నాకు మరో సంగతేదీ గుర్తేలేదు.

ఆహా! ఆ ప్రేమమయ హృదయంయొక్క వెచ్చనై ఆవేశమయమైన కంపితశబ్దాలు ఇప్పటికీ నా చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. నేను నిలబడివున్నాను. వినోద్ నా యెదుట మోకరించి, ప్రేరణ, వినయము, పట్టుదల కలిసి మూర్తీభవించినట్టున్నాడు. ఇటువంటి సమయం జీవితంలో ఒకే పర్యాయం వస్తుంది. కేవలం ఒక్క పర్యాయం. కాని దాని మధురస్మృతి యేదో స్వరసంగీతంలాగ జీవితంలో ప్రతి అణువులోనూ వ్యాపించివుంటుంది. నీవా ఆనందానుభవం పొందలేవు. నేను ఏడవటం ప్రారంభించాను. మనస్సులో ఏ యే భావాలు కలిగాయో చెప్పలేను. కాని నా కళ్ళనుంచి అశ్రుధార ప్రవహించింది. బహుశః ఆనందానికిదే చరమసీమ యేమో! నేను కొంచెం కొంచెం నిరాశపడ్డాను. మూడు

నాల్గురోజులనుంచి వినోద్ వస్తూపోతూ కుసుమతో మాట్లాడ టం చూచాను. కుసుమ రోజూ కొత్త కొత్త నగలు సింగా రించుకొనేది. ఏంచెప్పను? ఒకరోజున వినోద్ కుసుమ కవి త్వం నాకు వినిపించి, ఒక్కొక్క శబ్దానికీ తల ఊపాడు. నాకసలే అభిమానంగదా! ఆలోచించాను. ఆ పిశాచాని కీయ నంత పరవశమయిపోయేటప్పుడు ఈయనకోసం నా బుర్ర పాడు చేసుకొనేటంత అవసరం నాకేంపట్టింది! మర్నాడు ఆయన వస్తే ఆరోగ్యం బాగాలేదని చెప్పమన్నాను. కాని నన్ను కలియ టాని కాయన పట్టుదల చూపగానే నేను గదిలోకి రాకతప్పింది కాదు. స్పష్టంగా చెప్పేద్దామని నిశ్చయించుకొన్నాను. 'ఇంక మీరు వస్తూఉండకండి. నేను మీకు తగను. నేను కవినిగాని, విదుషినికాని గాను, సుభాషిణినికాను...' ఒక పెద్ద 'స్పీచ్' మనస్సులో పొంగుతోంది. కాని గదిలోకివచ్చి వినోద్ సతృష్ణ నేత్రాలు చూచాను. ప్రబలమైన ఉత్కంఠతతో కంపిస్తూఉన్న పెదవులు. —సోదరీ! ఆ ఆవేశాన్ని చిత్రించలేను. వినోద్ నన్ను కూర్చోనివ్వలేదు. నా యెదుట మోకరించి తివాసీ మీద కూర్చున్నాడు. ఆయన ఆశాయుతోన్నత శబ్దాలు నా హృదయాన్ని తరంగితం చేశాయి.

ఒక వారం సన్నాహాలతో గడచింది. పాప (నాన్న) మామ్మ, ఆనందం పట్టలేక పోతున్నారు. అందరికంటె ఎక్కువ సంతో షించింది కుసుమ. ఆ కుసుమరూపం నా కసహ్యం వేసేదే! ఆమె నా కిప్పుడర్థమయింది. నే నామె ననుమానించి ఆమెకు ఘోరమైన అన్యాయం చేశాను. ఆమె హృదయం నిష్కపట మైనది. ఆ హృదయంలో ఈర్ష్యలేదు. తృష్ణలేదు. సేవయే

(2)

ఆమె జీవితానికి మూలతత్వం. ఆమే లేకపోతే ఈ యేడు రోజులూ ఎల్లా గడిచేవో తెలిసిందిగాదు. నే నేదో పోగొట్టు కొన్నట్టు కనిపించేదాన్ని. కుసుమపైనే నా భారం అంతా విడిచిపెట్టేశాను. నగలు ఎన్నటం, అలంకరించటం, బట్టలరంగు, కత్తిరింపు, మడత. ఈ విషయాల్లో ఆమె అభీష్టం విలక్షణ మైనది. ఎనిమిదో రోజున ఆమె నన్ను పెళ్ళి కూతుర్ని చేసి నప్పుడు నా రూపం చూచుకొంటే నాకే ఆశ్చర్యమైంది. నే నెప్పుడూ ఇంత అందకత్తె ననుకోలేదు. గర్వంతో నా కళ్ళకే నిషా యేర్పడింది.

ఆవేళ సాయంకాలం వినోద్, నేను రెండు భిన్న జల ధారలు 'సంగమం'లో కలిసినట్లు కలిసి అభిన్నం అయ్యాం. విహారయాత్రకు అంత క్రితమే అంతా సిద్ధమయివుంది. ప్రొద్దున్నే మేము మంసూరీకి బయలుదేరాం. కుసుమ మమ్మల్ని సాగ నంపటానికి స్టేషన్‌దాకా వచ్చింది. సెలవు తీసుకుంటూ కంట నీరు పెట్టుకొంది. ఆమెనుకూడా తీసుకువెడదామనే అనుకొ న్నాను. ఎందుచేతో ఒప్పుకుంది కాదు.

మంసూరీ చాలా అందమైంది. ఏమీ సందేహంలేదు. శ్యామల జలదాలు పర్వతాలమీద విశ్రమిస్తున్నాయి. శీతల పవనం ఆశాతరంగాలలాగ చిత్తరంజనం చేస్తోంది. కాని వినోద్‌తో కలిసివుంటే ఏ నిర్జన వనంలోనో ఉన్నప్పటికీ ఇంత సుఖంగా నే నుండగలనని నా దృఢ విశ్వాసం. ఆయన్ని పొం దాక నాకింకే వస్తువులమీద లాలసలేదు. చెల్లీ! నీవీ ఆనంద మయ జీవితాన్ని ఊహించనైనాలేవు. ఉదయమైంది. 'టిఫిన్

వచ్చింది. మేమిద్దఱం టిఫిన్ తీసుకున్నాం. బండి సిద్ధంగా ఉంది. తొమ్మిది గంటలయ్యేసరికి షైరు బయలుదేరాం. ఏదో ఒక జలపాతం దగ్గరకు వెళ్ళి కూర్చున్నాం. అక్కడ జలప్రవాహ మధుర సంగీతం వినటం కాస్సేపు. కాస్సేపు ఒక రాతిమీద కూర్చొని మేఘాల వ్యోమక్రీడ చూడటం. 11 కొట్టేసరికి యింటికి మళ్ళాం. భోజనం సిద్ధంగా ఉంది. భోజనం చేశాం. నేను 'పియానో' దగ్గఱ కూర్చున్నాను. వినోద్‌కి సంగీతం అంటే యిష్టం. తాను బాగా పాడతాడు. నేను పాట ప్రారంభించానా, యింక పొంగిపోతాడు. మూడు గంటలకి మేము ఒక గంట విశ్రాంతి తీసుకొన్నతర్వాత ఆడటానికో, ఏ ఆటైనా చూడటానికో వెడతాం. రాత్రి భోజనం చేసినతర్వాత 'థియేటర్' చూస్తాం. అక్కడనుంచి వచ్చి శయనిస్తాం. అత్తగారి సాధింపులు, ఆడబడుచు ఎత్తిపొడుపులు, తోడికోడళ్ళ వెక్కిరింపులు యేమీ లేవు. కాని యీ సుఖంలో కూడా నా కప్పుడప్పుడనుమానం కలుగుతూ వుంటుంది—'పువ్వులో ఎక్కడా ముల్లు లేదుకదా! వెలుతురు వెనక చీకటి లేదుగదా!' అని ఇటువంటి అనుమానం నాకెందుకు గలుతుందో అర్థమవటంలేదు. అయిదు గంటలయింది. అదుగో! వినోద్ సిద్ధంగా వున్నారు. ఈవేళ టెన్నిస్ 'మ్యాచ్' చూడటానికి వెళ్ళాలి. నేనుకూడ తొందరగా తయారు కావాలి. మిగిలిన సంగతులు తర్వాత వ్రాస్తాను.

ఆఁ ఒక సంగతి మరచిపోయాను. నీపెళ్ళి సమాచారాలు వ్రాయి! భర్త ఎల్లా వుంటాడు? రంగు, రూపం ఎల్లాటిది? అత్తవారింటికి వెళ్ళావా, ఇంకా పుట్టింటనే వున్నావా? అత్త

వారింటి కెడితే అక్కడి అనుభవాలు తప్పక వ్రాయాలి. అక్కడ నీకు బాగా మర్యాద జరిగి ఉంటుంది; ఇంట్లోనూ కుటుంబంలోనూ కూడా. పేటలోవున్న మహిళలంతా మేలి ముసుగెత్తి నీ ముఖం చూచివుంటారు. బాగా పరీక్ష జరిగి వుంటుంది. ఈ సంగతులన్నీ వివరంగా వ్రాయేం! చూద్దాం, ఎప్పటికి కలుసుకుంటామో!

నీ పద్మ



## 4

గోరక్‌పూర్, 1-9-25.

ప్రియ పద్మా!

నీ ఉత్తరం చదివాక చిత్తశాంతి కలిగింది. నీవు రాక పోవటంవల్ల వినోద్ బాబు నిన్నపహరించుకు పోయాడనుకొన్నాను; కాని నీవు మంసూరీ చేరావనుకోలేదు. ఇప్పుడా ఆమోద ప్రమోదాల్లో ఈ సీత నీ కెందుకు గుర్తుంటుంది? వివాహ నూతనాదర్శంలోను, ప్రాచీనాదర్శంలోను ఎంత అంతరం ఉందో నాకిప్పుడు తెలుస్తోంది. నీవు నీకు నచ్చిన పని చేశావు. సుఖంగా ఉండు. నేను లోకమర్యాదకు దాసినై దురదృష్టానికి దుఃఖిస్తున్నాను.

సరే, ఇంక నా సంగతి విను. కట్నాలు గిట్నాలు నాకు గిట్టవు. నాన్నగారు చాల ఉదారహృదయులు. తృప్తిగా

ఇచ్చివుంటారు. పెళ్ళివారు గుమ్మంలోకి వచ్చినప్పటినుంచే నా కగ్నిపరీక్ష ప్రారంభమైంది. వరుణ్ణి చూడాలని యెంత ఉబలాటపడ్డాను! కాని ఎల్లా చూడను! కులమర్యాదంతా చెడిపోదూ! గుమ్మంలోకి పెళ్ళివారు వచ్చారు. జనమంతా పెళ్ళికొడుకు చుట్టూ మూగారు. మేడమీదకు వెళ్ళి చూద్దామనుకొన్నాను. మేడెక్కేనుగాని అక్కడేమీ కనిపించలేదు సరికదా, ఈ అపరాధానికి అమ్మచేత తిట్లు పడవలసివచ్చింది. వీళ్ళకి నా విషయం ఏది బాగుండకపోయినా ఆతప్పు నా చదువుమీద పడుతోంది. నాన్నగారు పాపం నాయందు సానుభూతి చూపుతారు. కాని ఎంతమంది నోట్లో నోరు పెడతారు! ఎదురుసన్నాహమైంది. అగ్ని ప్రదక్షిణాలకి సన్నాహాలౌతున్నారు. విడిదిలోనుంచి నగలు, బట్టలు వచ్చాయి. అక్కా! ఇంట్లో ఆడవాళ్ళు, మగవాళ్ళు అంతా వాటిమీద విరుచుకుపడ్డారు. ఏమిటో! వీళ్లెప్పుడూ ఏమీ చూడనట్లే. ఒకత్తె కంటె తేలేదంటుంది. హారమో అని యింకొకత్తె ఏడుస్తుంది. అమ్మ నిజంగా ఏడవటమే మొదలుపెట్టింది; నన్నెందులోనో ముంచేసినట్లే.

మగ పెళ్ళివారిని తెగతిట్టారు. కాని నేనుమాత్రం నగలవైపు కన్నెత్తైనా చూడలేదు. పెళ్ళికొడుకు సంగతేదైనా వస్తేమాత్రం తన్మయత్వంతో వినేదాన్ని. 'మనిషి సన్నం, చామనచాయ, కళ్ళు పెద్దవి, నవ్వుముఖం అని తెలిసింది. ఈ సూచనలవల్ల చూడాలనే కోరిక యింకా ఎక్కువైంది. అగ్ని ప్రదక్షిణ ముహూర్తం దగ్గఱపడినకొద్దీ నాచిత్తం వ్యగ్రం అవుతోంది. ఇంతవఱకూ నేనాయన్ని మెరుపులాగైనా

చూడకపోయినా, నా కాయనమీద అపూర్వమైన ప్రేమానుభవం కలుగుతోంది. ఆయనమీద ఈగవాలినా నాకు బాధగానే వుంటుందింక. ఇప్పటివరకూ నే నాయన ఎదుటపడలేదు. ఆయన కంఠమైనా వినలేదు. కాని తదితరు డెంతందగాడైనా నన్నాకర్షించలేడు ఇంక ఇప్పుడాయనే నా సర్వస్వం.

అర్ధరాత్రి అయినతరువాత అగ్నిప్రదక్షిణా లయ్యాయి. ఎదుట హోమకుండము. రెండు ప్రక్కలా బ్రాహ్మణులు కూర్చున్నారు. దీపం వెలుగుతోంది. కులదేవతామూర్తి నుంచారు. వేదమంత్రాలు పఠిస్తున్నారు. ఆ సమయంలో నిజంగా దేవతలక్కడికి వచ్చినట్లే అనిపించింది. అగ్ని, వాయువు, దీపం, నక్షత్రాలు అన్నీ నాకప్పుడు దైవికజ్యోతులై వెలుగుతూ ఉన్నట్లనిపించాయి. నాకు మొదటిసారిగా ఆధ్యాత్మిక వికాసం పరిచయమయింది. అగ్నిముందు నేను లోకాచారానికి తలవంచలేదు. అగ్ని నాయెదుట స్వర్గీయ తేజోమూర్తియై కనుపించాడు. చివరకి అగ్నిప్రదక్షిణా లయ్యాయి. కాని పతిదేవుని దర్శనం కాలేదు.

ఉదయం టిఫిన్‌కి వచ్చినప్పుడు చూద్దామన్నది చివరి ఆశ అయింది. అప్పుడాయన చుట్టూ గుంపుండదు. చెలులతో నేనూ వెళ్ళికూర్చుంటాను. తృప్తితీరా చూడవచ్చు అనుకొన్నాను. కాని దైవం ఇంకొక కుచక్రం పన్నుతున్నాడని యేం తెలుసు? తెల్లవారి చూద్దునుగదా, విడిదిలోంచి మకాములు ఎత్తివేస్తున్నారు. విషయ మేమీలేదు. పెళ్ళివారికి టిఫిన్‌లు పంపించారు. అవి చాలలేదుట. బహుశః నెయ్యికూడా వాసన దేమో! మా నాన్నగారిని నీ వెరుగుదువు గదా! ఎప్పుడూ ఎవరికీ ఒదిగి

ఉండరు. ఎక్కడున్నా సింహామే. ఆయ నన్నారు —'పోతు న్నారు పోనివ్వండి. బతిమాలవలసిన అవసరం ఏమీ లేదు. మగ పెళ్ళివారిని సత్కరించటం ఆడపిల్లవారి ధర్మం. కాని సత్కారం అంటే బెదిరించి ప్రభావంచూపి పనిచేయించు కోవటం కాదు; ఎవడో ఆఫీసరు క్యాంపు వేసినట్టు. ఆయన తన పిల్లవాడికి పెళ్ళి చేయగలిగితే, నేనూ నాకూతురుకు పెళ్ళి జేయగలుగుతున్నాను.'

పెళ్ళివారు వెళ్ళిపోయారు. నేను పతిదర్శనం చేయలేక పోయాను. ఊరంతా పెద్ద గొడవైంది. విరోధులకు నవ్వటానికి సందు దొరికింది. నాన్నగారు చాలా సామాను తెచ్చి ఉం చారు. అదంతా పాడయిపోయింది. ఇంట్లో ఎవరిని చూచినా మా అత్తవారిని నిందించేవారే. అడివిమనుషులనీ, లోభులనీ, దుర్మార్గులనీని. నాకేమీ చెడుగు కనిపించలేదు. కాని పతికి విరుద్ధంగా నేనొక్క మాటైనా వినదలచుకోలేదు. ఒకనాడు అమ్మ అంది —'పిల్లవాడుకూడా తెలివితక్కువవాడే. పాలు తాగే పిల్లవాడేంకాదు. 'లా' చదువుతున్నాడు. గడ్డం మీసం వచ్చింది. అతను వాళ్ళనాన్నకి తెలియజెప్పాలి 'మీరుచేసేది తప్పని. కాని అతను తడిసిన పిల్లిలా ముడుచుకు కూర్చు న్నాడు'. అమ్మ ఇల్లా అంటూవుంటే నాకు కోపం వచ్చింది. ఏమీ అనలేదనుకో. అయినా నేనీవిషయంలో తనతో ఏకీ భవించనని అమ్మకు తెలిసింది. అక్కా! నేను నిన్నడుగుతు న్నాను. ఇల్లాంటి సమస్య వచ్చినప్పుడు ఆయనధర్మం ఏమిటి చెప్పు? వాళ్ళనాన్న, చుట్టాలు, చెప్పినట్లు వినకపోతే ఆయన కవమానం కదూ! అప్పుడాయన ఉచితమైనపనే చేశారు.

కొంచెం ఉమకు చల్లారిన తర్వాత ఆయన తప్పకుండా వస్తారని నాకు నమ్మకం ఉంది. నేనప్పటినుంచీ ఆయనకోసం ఎదురు చూస్తున్నాను.

పోస్టుజవాను ఉత్తరాలు తెచ్చినప్పుడల్లా ఆయన ఉత్తరంకూడా ఉంటుందేమోనని నా హృదయం కంపిస్తుంది. నేనే ఒక ఉత్తరం ఎందుకు వ్రాసి పారేయకూడ దనిపిస్తూ వుంటుంది. కాని సంకోచించి ఊరుకొంటున్నాను. బహుశః నే నెప్పటికీ వ్రాయలేను. అభిమానం కాదు; కేవలం సంకోచమే. కాని వారం పదిరోజుల వఱకు ఆయన ఉత్తరం రాకపోయినా, ఆయన రాకపోయినా, యీ సంకోచం అభిమానంగా మారుతుంది. నీవాయన కొక ఉత్తరం వ్రాయలేవూ? వ్యాపారం అంతా పరిష్కారమయిపోతుంది! ఇంతమాత్రం నామాట మన్నించవూ? కాని నీ పుణ్యమాయిరి; సీత వ్రాయమందని మాత్రం వ్రాయకు. ఇల్లాంటి తప్పు నీవు చేస్తావనుకోవటం నీ కన్యాయం చేయటమే. కాకపోయినా నేను తెలివైన దాన్నయిం దెప్పుడు ?

నీ సీత.



# 5

మంసూరీ, 20-9-25.

ప్రియ సీతా !

నేను నీ ఉత్తరం అందినమరునాడే కాశీ ఉత్తరం వ్రాశాను. దానికి జవాబుకూడా వచ్చింది. బహుశః బాబూజీ నీకువుత్తరం వ్రాసిఉండాలి. కొంచెం పాతకాలపు మనిషి. నాకైతే ఆయనతో ఒక్కరోజైనా పడదు. నీకు పడుతుందిలే. నాభర్త నా విషయంలో అల్లాంటి ప్రవర్తనకనక చేసిఉంటే అనవసరంగా కోపగించినా, నేను జీవితంలో మళ్ళీ ఆయన ముఖం చూచేదాన్నికాను. ఎప్పుడైనా వచ్చినా కుక్కని తరిమినట్లు తరిమేదాన్నే. పురుషునిమీద అందరికంటె ఎక్కువ అధికారం స్త్రీకుంది. తల్లిదండ్రులను సంతోషపెట్టటానికి అతడు స్త్రీని తిరస్కరించలేడు. నీ అత్తవారు చాల అసహ్యమైన పనిచేచేశారు. పాతకాలపు ఊహాలున్నవాళ్ళ హృదయాలు విలక్షణంగా ఉంటాయి. అవి ఇల్లాంటి విషయాలు సహిస్తాయి. చూస్తున్నాంకదూ ఫలితం! నీ నాలుక వాళ్ళని పొగడలేక అలిసిపోతుంది పాపం! ఆ గోడ శిథిలమైపోయింది. మరమ్మతు చేసినా పనికిరాదు. మళ్ళీ ఆ చోటులో క్రొత్తగోడ కట్టవలసిన అవసరం వచ్చింది.

బాగుంది. ఇంక నా కథవిను. నా వినోద్ నన్ను దగా చేశాడని నా కనుమానం. ఈయన ఆర్ధికదశ నేననుకొన్న మాదిరిగా లేదు. కేవలం నన్ను మోసగించటాని కీయన ఈ

పన్నుగడ పన్నాడు. మోటారు అద్దెది. బంగాళాకు అద్దె ఇంకా ఇవ్వలేదు. 'ఫర్నిచర్' అద్దెకి తెచ్చిందే. ఈయన నన్ను ప్రత్యక్షంగా మోసగించనిమాట నిజమే. ఎప్పుడూ తన సంపదనుగురించి డప్పాలు కొట్టలేదు. కాని యితడు చాలా ధనికుడని యితరు లనుకొనేలాగ ప్రవర్తించటంకూడా ఒక మాదిరి మోసమే. ఈ వేషమంతా ఏదో పిట్ట చిక్కాలని వేసిందే. ఇప్పటికీ చూస్తున్నాను. వినోద్ తన అసలు పరిస్థితి నాదగ్గిఱ దాచటానికే ప్రయత్నిస్తున్నారు. తన ఉత్తరాలని నన్ను చూడనివ్వరు. ఎవరైనావస్తే ఉలిక్కిపడతారు. లోపల నించే కంగారుపడుతూ ఎవరువారంటూరు. నీవు నన్నెరుగుదువుగా! నేను డబ్బుకు దాసీనిగాను. నాకు కేవలం విశుద్ధహృదయం కావాలి. పురుషార్థం, ప్రతిభవున్నవా డేవేళ కాకపోతే రేపైనా ధనికుడవుతాడు. ఈ కపటవల చూస్తే నాకు ఒళ్ళుమంట. వినోద్ కనుక నాకు తన కష్టాలు చెపితే నేనాయనకు సానుభూతి చూపుతాను. ఆయన బాధలు తొలగించటానికి యెంతైనా ప్రయత్నంచేస్తాను. ఈవిధంగా దాగుకొని యీయన నా సానుభూతి, సహకారం పోగొట్టుకోవడమే కాకుండా నా మనస్సులో అవిశ్వాసం, ద్వేషం, క్షోభ అనేవాటికి బీజాలు నాటుతున్నారు. ఈ చింత నన్ను చంపుతోంది. ఈయన తనసంగతి స్పష్టంగా చెప్పిఉంటే నేనీ మంసూరీకి ఎందుకు వస్తాను? లక్నోలో మనిషికి పిచ్చెత్తేటంత ఉడుకేమీ కలగదు. వేలకొలది రూపాయలకు నీళ్ళు వదలుకోవలసిన అవసరం ఉండకపోను. అన్నిటికంటె కఠిన సమస్య జీవికసంగతి. చాలా విద్యాలయాలకి 'అప్లికేషన్' పెట్టారు. జవాబుకోసం ఎదురు

చూస్తున్నారు. ఈ నెలాఖరి కెక్కడో 'జాబ్' దొరుకుతుంది. మొదట మూడు నాలుగు వందలిస్తారు. ఎలా గడుస్తుందో తెలియటంలేదు. 150 రూపాయలు పాప (నాన్న) నా కాలేజీ కర్చుకిఇస్తున్నాడు. పదిహేనురోజుల్లో ఉద్యోగం దొరక్కపోతే ఏంచేయను? ఇది మరీ బాధగావుంది. అన్నిటికంటె కష్టం వినోద్ నాదగ్గర చెప్పక గుట్టుదాచటం. మేమిద్దరం కూర్చొని విమర్శిస్తే సమస్యలన్నీ విడిపోతాయి. కాని దీనికి నేను తగ నని ఆయ ననుకొంటారు కాబోలు! బహుశః ఈయన ఉద్దేశం నేనొక పట్టుబొమ్మనని. నాకు రకరకాల నగలు, సుగంధ ద్రవ్యాలు, సిల్కుగుడ్డలు సింగారిస్తే చాలని. థియేటర్లో ఏదైనా కొత్త ఆట ఆడుతోందంటే పరుగెత్తుకువచ్చి నాకుచెప్తా తారు. ఎక్కడైనా ఏదైనా ఉత్సవంగాని ఆటగాని ఉన్నా, ఎక్కడికైనా షైరు వెళ్ళవలసివచ్చినా, ఆ శుభసూచన ఆల స్యం లేకుండా చేస్తారు. మహోత్సన్నంగా రాత్రింబవళ్ళు వినోదక్రీడల్లో, విలాసాల్లోనే మునిగివుండాలని నే ననుకొంటు న్నట్లు; నా హృదయంలో గాంభీర్యం లేశమైనా లేనట్టూను. ఇది నాకు ఘోరావమానం. ఇంక ఏన్నీ సహించలేను. నేను సంపూర్ణాధికారం తీసుకొని సంతోషంగా ఉండగలుగుతు న్నాను; అంతే. ఇప్పటికింతే. మీ ఇంటిదగ్గర సంగతులు వివ రంగా వ్రాయి! నన్నుగురించి నాకున్న చింతకంటె నిన్ను గురించి తక్కువ లేదు. చూడు, మన యిద్దరి డింగీలు ఎక్క డికి చేరుకొంటాయో! నీవు ఐదువేల సంవత్సరాల క్రిందటి స్వదేశీ పాత శిథిలనౌకమీద కూర్చున్నావు. నేను వేగంగల కొత్త మోటారుబోటుమీద. అమను, విజ్ఞానం, ప్రయత్నం.

నాతోకూడ వున్నాయి. అయినప్పటికీ యేదైనా దైవిక విపత్తు వస్తే ఈ మోటారుబోటుతోసహా మునిగిపోతాను. సాలుకి లక్షలకొలది మనుష్యులు రైలుప్రమాదాల్లో చస్తు న్నారు. కాని యెవ్వరూ ఎడ్లబళ్లమీద ప్రయాణాలు చేయటం లేదు. రైళ్ళు పెరుగుతూనే వున్నాయి. అంతే...

నీ పద్మ



# 6

గోరక్‌పూర్, 25-9-25.

ప్రియ పద్మా!

నీ ఉత్తరం అందింది. ఈ వేళ జవాబు వ్రాస్తున్నాను. కొన్ని నెలలుగా రాపాడుతున్నావు నీవు. ఈ విషయంలో నీవు నా దగ్గర కొంచెం ఉపదేశం పొందాలి. వినోద్‌బాబుమీద వ్యర్థంగా దోషారోపణ చేస్తున్నావు. ఏం? మొదట్లో నువ్వాయన ఆర్థికదశ యెందుకు తెలుసుకోకపోవాలి? రూపసి, రసికుడు, శిష్టుడు, వాణీమధురుడు ఒకడు లభించాడని అప్పుడు ఉబ్బిపోయావు. ఇప్పటికీ నీదే తప్పు. నీ ప్రవర్తనవల్ల నీలో గంభీరాంశా లున్నాయని నిరూపించుకో. అప్పుడు చూస్తాను-వినోద్‌బాబు నీ దగ్గఱ దాక్కొని ఎల్లా ఉంటాడో! చెల్లీ! మఱి అది మానవస్వభావం. తాము ప్రసన్నంగా ఉన్నట్టు లోకం

అనుకోవాలనే ప్రతివారూ కోరుతూవుంటారు. ఆ వేషాన్నే చివరికంటూ నిభాయించుకునేందుకు యత్నిస్తారు. ఇందులో సఫలుడైనవాని జీవితమే సఫలము. ధనమే సర్వ ప్రధానం. మర్యాద, కీర్తి, చివరకి చదువుకూడా డబ్బుతో కొనుక్కోగలిగే ఈ యుగంలో కృత్రిమంగా వేషంవేయటం ఒక మర్యాదయిపోయింది. అధికారం యోగ్యతను చూస్తుంది. ఇంతే అనుకో, ఈ దోషాలకి పూవుకి, పండుకీ ఉన్న సంబంధం ఉంది. యోగ్యత అనే పువ్వు విడిచిందా, అధికారం అనే పండు వస్తుంది.

ఈ జ్ఞానోపదేశం అయిన తర్వాత ఇప్పుడు నీకు హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తున్నాను. నీవు మా ఆయన పేర వ్రాసిన ఉత్తరం మంచిపనిచేసింది. ఆ తర్వాత ఐదో రోజున స్వామికృపాపత్రం నాకు లభించింది. అక్కా ! ఆ వుత్తరం చూచుకొన్నాక నా కెంత ఆనందం కలిగిందో నువ్వూహించలేవు. గ్రుడ్డివానికి కళ్లు వచ్చినట్లయిందనుకో. కాసేపు గదిలోకి వెళ్ళాను. కాసేపు ఇవతలకి వచ్చాను. ఇల్లంతా హడావిడి అయింది కాని నీ కా ఉత్తరం నిరాశాజనకంగా ఉంటుంది. నా కది సంజీవన మంత్రం; ఆశాజ్యోతి. ప్రాణేశుడు పెళ్లివారి మూర్ఖత్వానికి విచారం వెలిబుచ్చారు. కాని పెద్దవాళ్ళ ముందాయన నోరెత్తటం ఎల్లాగ ? పైగా మా వాళ్ళుకూడా వాళ్లకి చేయవలసినన్ని ఆదర సత్కారాలు చేయలేదు. చివరకిట్లు వ్రాశారు:- 'ప్రియా! నిన్ను చూడాలని నాకున్న ఉత్కంఠ ఎంతో వ్రాయలేను. నే నూహించుకొన్న నీ మూర్తి నిత్యమూ నా కళ్లకు కట్టినట్లుంటుంది. కాని కులమర్యాద

పాటించటం నా కర్తవ్యం. తల్లిదండ్రుల అనుమతిచ్చేదాక రాలేను. నీ వియోగంలో ప్రాణాలు పోయినాసరేగాని తండ్రి కోరిక నుపేక్షించలేను. ఒకటి మాత్రం నిశ్చయించుకున్నాను. ప్రపంచం తలక్రిందులైనా, దుర్మార్గుడ ననిపించుకొన్నా, తండ్రి కోపానికి గురి కావలసివచ్చినా ఇంకో పెళ్ళిమాత్రం చేసుకోను. కాని వ్యాపారం అంతిగా ముదరదనే నా వుద్దేశం. వీళ్ళు కొద్దిరోజులలో చల్లబడతారు. అప్పుడు నేను వస్తాను. నా హృదయేశ్వరిని పువ్వులలో పెట్టుకు తెచ్చుకుంటాను.'

సరే, ఇంక నాకు సంతుష్టి కలిగిందక్కా! నాకింకేమీ అక్కరలేదు. స్వామి నాపై నింత కృప చూపించారు. ఇంత కంటె ఎక్కువ ఇంకేం చేయగలరు? 'ప్రియతమా! నీ సీత యెప్పటికి నీదే. నీ యిష్టమే ఆమె కర్తవ్యం. ఆమె బ్రతికి ఉన్నంతకాలం నీ పవిత్రచరణాలం టేడుంటుంది. త్రోసి వేయవద్దు.'

సోదరీ! కళ్ళలోకి నీళ్లువస్తున్నాయి. ఇంక వ్రాయలేను; జవాబు త్వరగా వ్రాయి!!

నీ సీత



# 7

ఢిల్లీ, 15-12-25.

ప్రియ సోదరీ !

నన్ను క్షమించమని నిన్ను మళ్ళీ మళ్ళీ కోరుతున్నాను. కాళ్ళమీదపడుతున్నాననుకో. నేను త్వరం వ్రాయకపోవటానికి కారణం బద్ధకంకాదు. షైర్లు, సంతోషాలలో పడికాదు. ఏ రోజుకారోజే ఈవేళ వ్రాద్దామనుకొంటూఉంటాను. కాని అంతలో యేదోపని వచ్చిపడుతుంది; ఏదో జరుగుతుంది. దాంతో బాధ కలుగుతుంది. చిత్తశాంతి నశిస్తుంది. ఇంక మాట్లాడక ఊరుకొంటాను. నీవిప్పుడు నన్ను చూస్తే బహుశః గుర్తించ లేవేమో కూడా. మంసూరీనుంచి ఢిల్లీ వచ్చి ఒకనెల అయింది. ఇక్కడ వినోద్ కొక 'జాబ్' దొరికింది. మూడువందలిస్తారు. ఈ నెలంతా బజార్లో తిరగటంతోటే సరిపోయింది. వినోద్ నాకు పూర్తిగా స్వాతంత్ర్యం ఇచ్చేశారు. నాకు తోచింది చేయటమే. ఆయనతో ఏమీ సంబంధంలేదు. ఆయన నాకతిథి మాత్రమే. గార్హస్థ్య భారమంతా నామీద పడేసి ఆయన నిశ్చింతంగా ఉన్నారు. ఇంత యేమీ పట్టించుకోని మనిషిని నేనెక్కడా చూడలేదు. 'హౌజర్' లెక్కేగాని 'డిన్నర్' లెక్కలేదు. పిలిస్తే రావటం. లేకపోతే కూర్చోటం. నౌకర్లతో అసలేమీ మాట్లాడనని యీయన ఒట్టు పెట్టుకున్నారేమో? వాళ్ళని కూకలేయటం నేను. పెట్టుకోవటం నేను. తీసివేసినా నేనే. ఆయన సంబంధమేం లేదు. నేను చేసే ఏర్పాట్లకు ఆయన ఆలోచన చెప్పాలనీ, తప్పులు చూపించాలనీ నేను

కోరుతూఉంటాను. నేను బజారునుంచి యేవస్తువేనా తెస్తే అందులో నా జయాపజయాలు ఆయన నాకు చెప్పాలనుంటుంది. నెలవారీ ఖర్చుల బడ్జెటు తయారుచేసేటప్పుడు మా యిద్దరికీ బాగా వాదం జరగాలనికూడా నా కోరిక. కాని వీటిలో ఒకటీ నెరవేరదు. ఈ విధంగా ఏ ఆడదైనా యెంత కాలం ఇల్లు చక్కబెట్టుకు నెగ్గుకు వస్తుందో నా కర్థం కావటం లేదు. వినోద్ చేసిన ఈ ఆత్మసమర్పణ నా సొంత అవసరాలకేమీ పీకులాటే కలిగించలేదు. కాని, నా కిష్టమైన వస్తువు నా అంతట నేను కొని తెచ్చుకోవటం బాగాలేదు. కనీసం నా వల్ల కాదు కూడాను! నా కోసం నే నేదేనా వస్తువు తెచ్చుకొంటే ఆయన కోపపడరని కూడా నాకు తెలుసు. పైగా సంతోషిస్తారనికూడా నాకు విశ్వాసం ఉంది. కాని నాకు నచ్చిన శృంగార వస్తువులు ఆయన స్వయంగా తెచ్చియివ్వాలని నా మనసు కోరుతుంది. ఆయన దగ్గఱనుంచి తీసుకోవటంలో ఉన్న ఆనందం నేను స్వయముగా వెళ్లి తెచ్చుకోవడంలో ఉండదు.

మా నాయనగారిప్పటికీ నాకు నెలనెలకి వందరూపాయిలు పంపిస్తున్నారు. ఆ రూపాయలే నా స్వంత అవసరాలకి కర్చుపెట్టుకోగలను. కాని వినోద్ తన రూపాయలు ఖర్చు పెడుతున్నానని యెక్కడనుకుంటారో అని భయం వేస్తుంది నా కెందుకో? ఏ విషయానికీ కోపపడలేనివా డెందుకూ షంతోషించలేదుకూడా. ఆయన దేనికి సంతోషిస్తారో, దేనికి కోపపడతారో కూడా నాకు తెలియడంలేదు. దారి తెలియక ఇటూ అటూ తిరిగే మనిషి అవస్థలాగుంది. నీకు జ్ఞాపకం

వుండే వుంటుంది, మన మిద్దరం ఏదైనా లెక్క చేసిన తర్వాత దాని ఆన్సరెంత ఉత్సాహంగా చూచేవాళ్లం? మన ఆన్సర్ పుస్తకంలో ఆన్సరుతో సరిపోతే మన హృదయాల కెంత ఆనందం కలిగేది? పరిశ్రమ సఫలమైందని విశ్వాసం కలిగేది. పుస్తకంలో ఆన్సర్లివ్వని లెక్కలు చెయ్యాలనుండేదికాదు. పరిశ్రమ వ్యర్థమౌతుందనుకొనేవాళ్ళం. నేనూ రోజూ ప్రశ్నలు ఆన్సర్ చేస్తున్నాను. కాని అవి రైటో తప్పో తెలియటం లేదు. ఆలోచించు; నా మనస్సెలా వుంటుందో!

ఒక వారమవుతోంది. లక్నోనుంచి 'మిస్ రిగ్' వచ్చింది. ఈమె లేడీ డాక్టరు. మా యింటికి తరచు వస్తూపోతూ వుంటుంది. మాలో ఎవరికైనా కాస్త తలనొప్పివస్తే ఈమెనే పిల్చేవాళ్ళం. పాప(నాన్న) మెడికల్ కాలేజీలో ప్రొఫెసరుగా వున్నప్పుడు ఆయనదగ్గర చదువుకుందిట. ఇప్పటికీ ఆయనంటే చాలా గౌరవం. ఆమె ఇక్కడ కనిపించినప్పుడు భోజనానికి పిలవకపోవటం మర్యాదకాదు. ఆ వేళ నే పడ్డ కష్టం వర్ణించలేను.

నే నెప్పుడూ ఇంగ్లీషువాళ్ళతో కలిసి 'టేబుల్ మీల్సు' తీసుకోలేదు. వాళ్ల భోజనాలాచారం ఎల్లావుంటుందో నాకు బొత్తిగా తెలియదు. వినోద్ నాకా సంగతులన్నీ చెప్తా రనుకొన్నాను. ఆయన యేళ్లతరబడి ఇంగ్లీషువాళ్లతోబాటు ఇంగ్లండులో వున్నారు. నే నాయనకి 'మిస్ రిగ్' వస్తుందని చెప్పానుకూడా. ఆ పెద్దమనిషి వినిపించుకొన్నట్టుకూడా లేదు. నేనూ నిశ్చయించుకొన్నాను—'మిమ్మల్ని నే నేమీ అడగను. 'మిస్ రిగ్' వచ్చుతుంది అంతేగా! పోనీ' అని. నాలో

నేనే చాలా విసుగుపడ్డాను. 'ఈ మిస్ రిగ్ నెందుకు పిలిచా నురా బాబూ!' అని. మా ప్రక్క బంగాళాలో మావంటి కుటుంబమే ఉంటోంది. వాళ్ళని సలహా అడగవచ్చుగాని, నేను బొత్తిగా పనికిమాలినదాని ననుకొంటారేమో అని భయం. ఈ పరిస్థితిలో కాస్సేపేడుస్తూ కూర్చున్నాను. చివ రికి నిరాశపడి నా బుద్ధే ఉపయోగించాను.

మర్నాడు మిస్ రిగ్ వచ్చింది. మే మిద్దరం కూడా బల్ల మీద కూర్చున్నాం. విందు ప్రారంభమైంది. నేను చూస్తు న్నాను. వినోద్ రుసరుస లాడుతున్నారు. మిస్ రిగ్ మాటి మాటికి మూతి త్రిప్పుకుంటోంది. మర్యాదా భంగమైనట్లు కనిపిస్తోంది. నేను సిగ్గుపడి చస్తున్నాను. ఎలాగైతేనేం ఆపద తొలగింది. ఎప్పుడూ ఇంగ్లీషువాళ్ళకి విందుచేయనని లెంపలు వేసుకొన్నాను. అప్పటినుంచీ చూస్తున్నాను. వినోద్ నాకు కొంచెం దూరంగా వుంటున్నారు. నేనూ మాట్లాడ లేదు. నే నాయన్ని మూర్ఖుడుగా జమకట్టా ననుకొంటున్నా రేమో! ఆయన నన్ను సిగ్గుపరచారని నే ననుకొంటున్నాను. సీతా! ఈ కుటుంబ జంజాటల్లో పడి ఎవరితోటైనా కబుర్లు చెప్పుకోటానికిగాని, నవ్వుకోటానికిగాని నాకు టైమే ఉండటం లేదు. కొన్ని నెలలనుంచి కొత్తపుస్తకమేదీ చదవలేక పోయాను. వినోద్ - వినోద్ శీలతకూడా ఎక్కడికి పోయిందో బొత్తిగా అర్థం కావటంలేదు. ఇప్పుడాయన సినిమాపేరే ఎత్తటంలేదు. ఆఁ, నేను వెడితేమాత్రం ఆయన తప్పక తయారు. 'ప్రపోజల్' ఆయననోట రావాలనీ, నేను కేవలం దాన్ని ఆమోదించాలనీ ఉంటుంది నాకు. ఇప్పుడాయన వెను

కటి అలవాట్లు విడిచిపెట్టేస్తూన్నట్టుంది. ఆయన ముఖాన తపస్సంకల్పం అంకితమై ఉన్నట్టు నాకు కనిపిస్తోంది. గృహసంచాలనశక్తి తనకు లేక, ఈ భారమంతా నా మీద మోపారనుకొంటాను.

మంసూరీలో ఉన్నప్పుడు ఇంటిపెత్తనమంతా ఆయనే చేసేవారు. రెండున్నర నెలలకు పదిహేనువందలు ఖర్చయ్యాయి. ఎక్కడనుంచి తెచ్చారో ఇప్పటికీ నాకు తెలియదు. బహుశః దగ్గరేమైనా ఉందేమో! ఏ మిత్రునిదగ్గరైనా తీసుకున్నారో! నెలకి మూడువందల ఆదాయంలో ఇక సినిమా లెక్కడ? 50 రూపాయి లింటికే పోతున్నాయి. ఈ జంజాటనతో నాకు విసుగెత్తిపోతుంది. ఇంకిదంతా నా వల్ల కాదని వినోద్‌తో చెప్పేద్దామనుకుంటున్నాను. 'తమరు 5 గం॥లకు యూనివర్సిటీలో పనిచేసి పగలంతా బాగా సుఖపడతారు. చక్కగా టెన్నిస్ ఆడుకొంటారు. నవలలు చదువుతారు. హాయిగా నిద్రపోతారు. నేను తెల్లవారింది మొదలు అర్ధరాత్రిదాకా యింటిపనుల్లోపడి చావాలా?' అని.

చాలాసార్లు నే నాయనతో పోట్లాడదామని నిర్ణయించుకొన్నాను. అట్లా మనస్సులో అనుకొని దగ్గఱికి వెళ్ళాను కూడా. కాని ఆయన సామీప్యం నా నిర్ణయాన్నీ, నా బాధనీ, విరక్తినీ అన్నిటినీ హరిస్తోంది. ఆ వికసిత ముఖమండలం, ఆ అనురక్త నేత్రాలు, ఆ కోమలశబ్దాలు నా మీద మోహినీ మంత్రంలాగ పనిచేస్తున్నాయి. ఒక్క ఆలింగనంలో నా బాధంతా విలీనమైపోతోంది. ఈయన ఇంత రూపవంతుడు,

యింతటి మధురభాషి, యింత సౌమ్యుడు కాకపోతే చాలా బాగుండును. అప్పుడీయనతో పోట్లాటకి దిగేదాన్ని. నా కష్టాలు చెప్పుకో గలిగేదాన్ని. ఈ స్థితిలోమాత్రం నన్నీయన గొఱ్ఱెను చేశారు. కాని యీ మాయను పోగొట్టటానికి అదును కోసం వెదుకుతున్నాను. ఒక మాదిరిగా నేను ఆత్మగౌరవం పోగొట్టుకొని కూచున్నాను. నే నెందుకు ప్రతీదానికీ ఒకరి అప్రసన్నతకి భయపడాలి? నే చేసేదల్లా మంచికేననే భావం నా కెందుకు కలగటంలేదు? నే నెందుకింత మొగమాటం పడు తున్నాను? ఏమైనాసరే! నేనీ మనఃప్రవృత్తిమీద విజయం పొందాలి.

ఇప్పటి కింక సెలవు. మీ సమాచారాలు వెంటనే వ్రాయి! తెలుసుకోవాలని ఉంది.

నీ పద్మ



# 8

కాశీ, 25-12-25.

ప్రియ పద్మా!

నీ ఉత్తరం చదవగా నాకు చాల దుఃఖం కలిగింది. నవ్వూ వచ్చింది; కొంచెంకోపం వచ్చిందికూడా. నీ కేం కావాలో నీకే తెలియదు. నీ వాదర్శ భర్తను పొందావు. వ్యర్థశంకలతో

మనస్సు నశాంతపరచుకోకు. నీవు స్వేచ్ఛకోరేదానవు. నీకది లభించింది. ఇద్దరికీ మూడు వందలు తక్కువకావు. పైగా ఇప్పటికీ మీ పాప నీకు వంద రూపాయ లిస్తున్నారు. ఇంకేం కావాలి ? నీ చిత్తం కాస్త అవ్యవస్థితమౌసదని నాకు భయం వేస్తోంది. నీకు సానుభూతి చూపటానికి నాదగ్గర శబ్దం కూడా లేదు.

నేను 15వ తారీక్కి కాశీ వచ్చాను. నా స్వామి స్వయంగా నన్ను తీసుకురావటానికి వచ్చారు. ఇంటిదగ్గిర బయలుదేరే టప్పుడు చాల ఏడ్చాను. ఆపిల్ల లనవసరంగా ఏడుస్తారనుకొనే దాన్ని మునుపు. అయినా నాకు తల్లిదండ్రులను విడిచి ఉండ టం కొత్తకాదు. ఆరు సంవత్సరాలనుంచి దసరా, సంక్రాంతి, వేసవి సెలవులలో తప్ప ఇంటిదగ్గిర ఉండటమే లేదు, ఎప్పుడూ కంటనీరు వచ్చేదికాదు. మళ్ళీ త్వరలో కలుస్తామనే సంతోషం ఉండేది. కాని ఈ పట్టునలో హృదయాన్ని లాక్కుపోతున్నా రన్నట్టుంది. అమ్మని కౌగలించుకొని మూర్ఛ వచ్చేటంతగా ఏడ్చాను. కాని నాన్నగారి కాళ్ళమీదపడి ఏడవాలనే కోరిక అల్లాగే ఉండిపోయింది. ఆహా! ఏమి ఆ రోదనానందం! అప్పుడు నాన్నకాళ్ళమీద పడి ఏడ్చి నా ప్రాణాలైనా ఇచ్చే దాన్ని. నేనాయనకేమీ చేయలేకపోయానని బాధ. నన్ను పెంచటానికి వీళ్ళు ఎంత కష్టపడలేదూ! నేను పుట్టినప్పటినుంచీ రోగిష్టిదాన్నే. రోజూ మూలుగుతూనే ఉండేదాన్ని. అమ్మ తెల్లవార్లూ నన్ను తన ఒడిలో వేసుకు కూర్చునేది. నాన్న భుజాలమీదెక్కి తొక్కిన సంగతి నాకు గుర్తు వస్తూనేఉంది. ఆయన నన్నెప్పుడూ కళ్ళెఱ్ఱజేసైనా చూడలేదు. నాకు

కాస్త తలనొప్పివస్తే ఆయనకి మతిపోయేది. పదేళ్ళు వచ్చే దాకా ఇలా గడిచింది. ఆరేళ్ళు 'డేరాడూన్'లో గడిచాయి. ఇప్పుడు నాకు కాస్త యోగ్యతవచ్చి వాళ్ళసేవ చేద్దామనుకొనే సరికి అత్తవారింటికే పోతున్నాను. ఎనిమిది నెలలు మాత్రం వాళ్ళకు పరిచర్య చేయగలిగాను. ఈ ఎనిమిది నెలలే నా జీవన నిధి. మళ్ళా నేనీ తల్లిదండ్రులకే పుట్టాలనీ, ఈ పితృవాత్స ల్యానందం అనుభవించాలనీ దేవుణ్ణెప్పుడూ ప్రార్థిస్తూ కోరు కొంటున్నాను.

సాయంకాలం బండి స్టేషనులో బయలుదేరింది. నేను ఆడ వాళ్ళ పెట్టెలో ఉన్నాను. మిగిలినవారు మరొక పెట్టెలో ఉన్నారు. అప్పుడు నాకు స్వామిని చూడాలని ప్రబలమైన యిచ్ఛ కలిగింది. హృదయం సాంత్వన,సానుభూతి, ఆశ్రయం కోరుతోంది. నన్ను ఖైదీగా ఎక్కడికో తీసుకుపోతూన్న ట్టనిపించింది.

గంటసేపటికి బండి ఒకస్టేషనులో ఆగింది. నేను కిటికీనుంచి వెనక్కి చూస్తున్నాను. తలుపుతీసుకు లోపలికివచ్చా రెవరో. నేను తప్ప ఆ పెట్టెలో ఒక ఆడదికూడా లేదు. నే నులిక్కిపడి చూచాను. ఆ వచ్చింది ఒక పురుషుడు. నేను వెంటనే మేలి ముసుగు వేసుకొన్నాను. తమ రెవరని అడిగాను. 'ఇది ఆడ వాళ్ళపెట్టె. దయచేసి మగవాళ్ళ పెట్టెలోకి వెళ్ళండి'అన్నాను. ఆ పురుషునిలబడి 'నే నీపెట్టెలోనే కూర్చుంటాను. మగవాళ్ళ పెట్టెలో కాళీలే'దన్నాడు. నేను కోపంగా అన్నాను. 'కాదు. మీా రిక్కడ కూర్చోటానికి వీల్లేదు.'

'నేను కూర్చుంటాను.'

'తమరు వెళ్ళాలి. మీరు వెంటనే వెళ్లండి. లేకపోతే గొలుసు లాగుతాను.'

'అరే! నేనూ మనిషినే. జంతువును కాదు. ఇంతచోటుండగా మీకేం నష్టం?' ఇంతలో బండి కూతవేసింది. నే నింకా కంగారు పడి అన్నాను - 'మీరు వెడతారా? నేను గొలుసు లాగనా?'

అతడు నవ్వి అన్నాడు - 'మీరు చాల కోపదారి లాగున్నారే! ఒక యువకునిమీద మీకేమీ జాలి కలగటంలేదూ?'

బండి బయలుదేరింది. నాకు కోపం వచ్చింది. సిగ్గేసింది. నే నన్నాను. 'తమరు కూర్చోండి. నేను పోతున్నాను!'

అక్కా, నేను నిజం చెప్తున్నాను. అప్పుడు నాకేమీ భయంలేదు. ఉరికితే చస్తానని తెలుసు. కాని ఒక పరాయి వాడితో ఒంటరిగా కూర్చోవటంకంటే చావటం మంచిది. నేను ఒక్క అడుగు వేశాను. అతడు నాచేయి పట్టుకొన్నాడు. లోపలికి లాగుతూ 'ఈపాటికి నే నే ద్వీపాంతరవాసశిక్ష అనుభవించవలసిన వాణ్ణేనా! బలేగా చేశారు. కూర్చోండి. కాస్త మాట్లాడండి. నవ్వండి. పై స్టేషనులో దిగిపోతాను. ఈ కొద్దిసేపు నామీద కృపాకటాక్షం బరపరాదూ? మిమ్మల్ని చూస్తే నా హృదయం స్వాధీనం తప్పుతోంది. ఎందుకు నన్ను చంపుతారు!' నేను చప్పున నా చేయి వదలించుకొన్నాను. శరీరమంతా కంపం పుట్టింది. కళ్లనీళ్ళు వచ్చాయి. అప్పుడు గనక నాదగ్గర కత్తేనా ఉంటే చంపటానికే సిద్ధపడేదాన్ని. కాని అప్పుడు పెదవి కొరికి కళ్ళెఱ్ఱజేయుటకంటే చేయగలిగింది లేక

పోయింది. చివరకు అరవటం అనవసరం అనుకొని సావధానంగా అన్నాను - 'తమ రెవరు ?'

ఆయనా పద్ధతిలోనే అన్నాడు - నీ ప్రేమ కోరేవాణ్ణి!

'తమరు పరిహాసంచేయక నిజం చెప్పండి?'

'నిజం చెప్తున్నాను. నేను నీ ప్రేమికుణ్ని.'

'మీరు నన్ను ప్రేమిస్తూ వుంటే నా మాట మన్నించి వచ్చే స్టేషనులో దిగిపొండి. నన్నవమానపరిస్తే మీకేం కలిసివస్తుంది ? నా మీద దయచూపండి.'

నేను చేతులు జోడించి పైమాట లన్నాను. నా కంఠం రుద్ధమయింది. ఆ మనిషి గుమ్మంవైపుకు వెళ్ళి 'ఇదే తమ ఆజ్ఞ అయితే యిదుగో పోతున్నాను. జ్ఞాపకముంచుకోండి' అని తలుపు తెరిచాడు. ఒక అడుగు ముందుకు వేశాడు. క్రిందికి దూకబోతున్నాడు. అక్కా! నాకు కంగారు పుట్టింది. మెరుపులాగ ఒక్క దూకు దూకి ఆయన చేయిపట్టుకొన్నాను. లోపలికి లాగాను. ఆయన బాధితస్వరంతో 'ఎందుకు లాగారు ? నేను వెళ్ళిపోతున్నా'నన్నాడు.

'పై స్టేషన్ రాసీయండి.'

'మీరు తరిమివేసేటప్పుడెంత తొందరగా పోతే అంత మంచిది.'

'బండి పరుగెడుతూంటే దూకమని నే నెప్పుడు చెప్పాను?'

'నా మీద దయవుంటే ఒకసారి కాస్త ప్రసన్నంకారాదూ!'

'మీ స్త్రీతో పరాయివా డెవడైనా యిల్లా మాట్లాడితే మీ కెల్లావుంటుంది ?'

ఆయన కోపంతో అన్నారు. 'నేనైతే వాడిరక్తం పీల్చేస్తాను'?

నేను సంకోచం లేకుండా అన్నాను. 'అయితే మీ విషయంలో నా భర్త ఎల్లా వ్యవహరిస్తారో తెలుసా ?'

'ప్రియా ! నిన్ను నీవే రక్షించుకోగలవు. నీకు భర్త సహాయం అవసరం లేదు. ఇప్పుడు రా! నన్నాలింగనం చేసుకో. నేనే నీ భాగ్యశాలియైన స్వామిని; సేవకుణ్ణి.'

నా హృదయం ఉప్పొంగింది. 'అరే మీరా !' అని ఒక్క మాట నా నోట వచ్చింది. ఇంక దూరంగా తొలగి నుంచున్నాను. ఒక చేత్తో మేలిముసుగు బాగా సర్దుకున్నాను. నోట మాట పెగలటం లేదు. స్వామి అన్నారు. ఇప్పుడీ సిగ్గు, ముసుగు ఏమిటి ?'

నే నన్నాను. 'మీరు బలే మోసగాళ్ళు. ఇంత సేపు నన్నేడిపి స్తే మీ కేం వచ్చింది చెప్పండి'?

స్వామి:- ఇప్పుడీ కాస్సేపట్లో నిన్ను గుర్తించినంతగా ఇంట్లో అయితే బహుశః కొన్ని సంవత్సరాల కేనా గుర్తించ లేను. ఈ అపరాధం క్షమించు; నిజంగా నీవు బండిలోనుంచి దూకే దానవా ?

' తప్పక '

'ఇంకా నయం. కాని యీ పరిహాసం చాలాకాలం జ్ఞాపకముంటుంది.' నా స్వామి ఆట్టే పొట్టికాదు; పొడుగు కాదు;

చామనచాయ; ముఖంమీద స్ఫోటకంమచ్చ లున్నాయి. సన్నంగా వుంటారు. ఆయనకంటే అందగాళ్ళను చూచాను గాని ఇప్పుడు నా హృదయమెంత ఉల్లాసం పొందిందో, ఎంత సంతుష్టి ననుభవించిందో వర్ణించలేను.

నే నడిగాను – 'బండెప్పటికి చేరుకుంటుంది ?'

'సాయంత్రానికి వెళ్ళిపోతాం.'

స్వామిముఖం విచారంగా కనిపించింది. పదినిముషాలవఱకు మాట్లాడకుండా అనతలికిచూస్తూ కూర్చున్నారు. నే నాయన్ని మాటల్లోకి దింపటానికే ఈ అనవసర ప్రశ్న వేశాను. కాని యిప్పటికీ ఆయన మాట్లాడకపోయేసరికి నేను వదలలేదు. నేను 'పాన్‌దాన్' తెచ్చి కిళ్ళీ కట్టటం ప్రారంభించాను. వెంటనే ఆయన అన్నారు – 'సీతా, ఒకమాట చెప్పనా ?'

'ఆఁ. ఆ. చెప్పండి; హాయిగా చెప్పండి'.

ఆయన తలవంచుకొని సిగ్గుపడుతూ అన్నారు. 'నీ వింత రూపవతివని తెలిసిఉంటే నిన్ను నేనసలు పెండ్లి చేసికొనేవాణ్ణి గాను. నేను నీ కన్యాయం చేశానని నిన్ను చూశాక అర్థ మయింది. నే నేవిధంగానూ నీకు తగను.' నేను కిళ్ళీ ఆయన కిస్తూ అన్నాను. 'అల్లా అనకండి. మీ రెటువంటివారైనా నా సర్వస్వం మీరే. నేను మీకు దాసినై ధన్యురాలయ్యా ననుకొంటున్నాను.'

తర్వాత స్టేషన్ వచ్చింది. బండి ఆగింది; నా స్వామి వెళ్ళి పోయారు. బండి ఆగినప్పుడెల్ల ఆయనవచ్చి రెండు కబుర్లు

చెప్పి వెళ్ళేవారు. సాయంకాలానికి మేము 'బెనారెస్' చేరాం. ఇల్లు ఒక సందులో ఉంది. మా యింటికంటె చాల చిన్నది. ఈ నాలుగు రోజులలోనూ అర్థమయిం దేమిటంటే— అత్త గారు కొంచెం గయ్యాళి. కాని అప్పుడే ఎవర్నిగురించీ ఏమీ చెప్పలేను. బహుశః నేను భ్రమపడుతున్నానేమో! తర్వాత వ్రాస్తాను.

'ఇల్లెటువంటిదీ, ఆర్థికదశ ఎట్టిదీ, అత్తమామ లెటు వంటివారు' అనే చింత నా కేమీ లేదు. ఇక్కడందరు నావల్ల సంతోషపడాలనే నా కోరిక. పతికి నా యందు ప్రేమఉంది. ఇది నాకు చాలు. నా కింకేమీ పరవాలేదు. మీ మరదిగారు మాటిమాటికి నా దగ్గఱకు రావటం అత్తగారికి నచ్చటంలేదు. 'ఇదెక్కడ నెత్తి నెక్కుతుందో' అనుకుంటున్నారు. ఆమెకు నా మీద యింత నిర్దయ యెందుకో చెప్పలేను. కాని యీ విషయంలో ఆమె కోపపడుతోందీ అంటె అది మా మేలు కోసమే అని నే నెరుగుదును. మా హితంకోసం కాకపోతే ఆమె ఏపనేనా ఎందుకు చేస్తుంది? తన సంతానానికి అహితం ఏ తల్లీ చేయలేదు. నాలోనే ఏదో చెడుగు ఆమెకు కనిపించి ఉండాలి. రెండు మూడు రోజుల్లో దానంతట అదే తెలు స్తుంది.

మీ యింటిదగ్గఱి సమాచారాలు వ్రాయి. ఒక నెల దాకా జవాబు ఆశ లేదులే. నీ యిష్టం.

నీ సీత



# 9

ఢిల్లీ, 1-1-26.

ప్రియ సోదరీ !

నీ ప్రథమ సమాగమకథ కుతూహలమయంగా ఉంది. అది చదవగానే నా చిత్తం ప్రసన్నమయింది. నీమీద నా కిప్పు డసూయ కలుగుతోంది. నన్ను చూస్తే నీకు అసూయ కలుగు తుందనుకొన్నాను. కాని తారుమారైంది. నీకు నాల్గు వైపుల పచ్చతనమే కనబడుతోంది. నే నెటుచూస్తే అటు ఇసుక గుట్టలుతప్ప యింకేమీ లేదు. సరే ఇంక కొంచెం నా వృత్తాంతం చెప్తా విను.

హృదయం బాగాచిక్కబెట్టుకొనివిను. నా వంతు వచ్చింది. వినోద్ యొక్క అవిచలితదార్శనికత ఇప్పుడు అసహ్యమైంది. ఏమిటో ! విచిత్రజీవం ! కోపంలో ఏమివచ్చినా లెక్కలేదు. ఈయనికి నామీద ఏమీ దయలేదు. నేను ప్రొద్దుటనుంచి సాయంత్రందాకా యింటిజంజాటనతో కుళ్ళిపోతూ ఉన్నా తనకేమీ పరవాలేదు. ఇంత సానుభూతిలేని మనిషి నెక్కడా చూడలేదు. అసలే అడివిలోనో తపస్సు చేసుకుంటూ ఉండ వలసిన వ్యక్తి. ఇప్పుడుమాత్రం రెండుప్రాణాలే. కాని పిల్లలు కూడా ఉంటే నేనిక వట్టిపుణ్యానికి చచ్చి ఊరుకొనేదాన్ని. భగవంతు డెప్పుడా దారుణవిపత్తు నా నెత్తిని తెచ్చిపెట్టకుండా ఉండాలి బాబోయ్ !

సీతా! ఇప్పుడు నాకు పట్టుకొన్నదేమిటంటే ఎలాగోలాగ ముందు ఈయనసమాధికి భంగం కలిగించాలి. కాని ఏ ఉపా

యమూ ఫలించటం లేదు! ఏ ఎత్తుగడ అతక లేదు. ఒకనాడు నేనాయనగదిలో 'బల్బు' పగలగొట్టాను. గది చీకటిమయమైంది. ఆయన షైరుకి వెళ్ళివచ్చి గది చీకటిగాఉండటంచూచి నన్నడిగారు. నేను బల్బుపగిలిపోయిందని చెప్పేశాను. అంతే! ఆయన భోజనంచేసి నా గదిలోకివచ్చి పడుకొన్నారు. పేపర్లు, నవలలు చూడనైనా లేదు. ఆ ఔత్సుక్యమంతా యేమయిపోయిందో! పగలంతా గడచింది. బల్బు వేయించాలనే చింత తనకేమీ లేదు. చివరకు నేనే బజారునుంచి తేవలసివచ్చింది.

ఓనాడునాకు ఒళ్లుమండి వంటవాణ్ణి లేవగొట్టేశాను. అయ్యగారు తెల్లవార్లు ఆకలితో మాడితే తెలిసివస్తుందనుకొన్నాను. కాని ఈపెద్దమనిషి యేమీఅడగనేలేదు. టీ లేకపోయినా సరే ఏమీ పరువాలేదు. సరిగ్గా పది గంటలయ్యేసరికి బట్టలు వేసుకొన్నారు. ఒకసారి వంటింటివైపు చూచారు. అంతా నిశ్శబ్దంగాఉంది. సరే, కాలేజీకి వెళ్ళిపోయారు. మరొకరైతే-'వంటవాడెక్కడికి వెళ్ళాడు! ఎందుకు వెళ్లాడు? ఇప్పుడు కాబోయే ఏర్పాటేమిటి? ఎవరు వంట చేస్తారు!' అని అడిగేవారు. 'పోనీ నీవు వండుకో. లేకపోతే, బజారునుంచి 'మీల్స్' తెప్పించుకో' అనేనా కనీసం నాతో చెప్పిఉండేవారు. ఆయన వెళ్ళిపోయాక నాకు చాలా పశ్చాత్తాపం కలిగింది. 'రాయల్ హోటల్' నుంచి తిండి తెప్పించాను. బంట్రోతుచేత కాలేజీకి పంపించాను. నేనుమాత్రం ఆకలితోటే పడుకొన్నాను. పగలంతా ఆకలితో ఉండటంవల్ల ఆరోగ్యం చెడింది. తలపోటు వచ్చింది.

ఆయన కాలేజీనుంచివచ్చి నేను పడుకోవటంచూచి జ్వరం వచ్చిందేమో అని కంగారు పడ్డారు. వెంటనే డాక్టరుని పిలి

పించారు. డాక్టరు వచ్చాడు. నా కళ్ళు చూచాడు. నాలుక చూచాడు. జ్వరం చూచాడు. నాకు మందు తేవటానికి వెళ్ళిన మనిషి మందుతో బాటు 12 రూ. బిల్లుకూడా తెచ్చాడు. ఇవన్నీ చూచేసరికి నా కెక్కడకైనా పారిపోదామా అని పించింది. పైగా ఆయన పడకకుర్చీ వేసుకొని నా మంచం దగ్గరే కూర్చొని ఎల్లాఉంది? బాధ యేమైనాకొంచెం తగ్గిందా? అని క్షణక్షణానికి అడగటం మొదలుపెట్టారు. లోపల ఆక లితో నేను చస్తున్నాను. మందు ముట్టుకోనైనాలేదు. చివ రకు నేనే అన్నం తెప్పించుకొని తిన్నాను. మళ్ళీ పరిస్థితి మారి పోయింది. తెల్లవారితే మళ్ళీ ఈ మహాశయుడు డాక్టరు నెక్కడ పిలిపిస్తాడో అని చాలా భయపడిపోయాను. అంచేతనే ప్రొద్దున్నే ఇంట్లో పనులు చేయటం మొదలుపెట్టాను. అప్పుడే కొత్త వంటవాణ్ణి పిలిపించాము. పాత వంటవాణ్ణ తప్పులేసిదే లేవగొట్టినందుకు ఎందుకుపనికిరానివాణ్ణి పెట్టుకోవలసివచ్చింది.

వీడు మామూలు చపాతీలుకూడా చేయలేడు. ఆవేళనుంచీ ఇంకో కొత్తవిపత్తు నెత్తినపడింది. పైగా తనకు వంట బాగా తెలుసునని వీడిగర్వం. నేనెంత అఱచినా తనకుతోచినట్లే చేస్తాడు. మధ్యమధ్య నవ్వుతాడు. 'ఈ సంగతి నీకేం తెలుసు? నోరు మూసుకుకూర్చో' అన్నట్లుంటుందా నవ్వు. వినోద్‌ను బాధ పెట్టాలనుకొన్నాను. నేనే బాధపడ్డాను. డబ్బు ఖర్చ యితే అయింది. ఇంకో జంజాటంలో చిక్కుకోవలసి వచ్చింది. వినోద్ డాక్టరును పిలవడంకాని నా ప్రక్కను కూర్చోవటం గాని ఏదో ముఖప్రీతని నాకు బాగా తెలుసు. ఆయన ముఖంలో ఏమీ కంగారు కనిపించటంలేదు. చిత్తానికి అశాంతిలేదు.

సీతా! నన్ను క్షమించు. ఇల్లాంటి పురుషుడు నీకు దొరికితే నీ అవస్థ ఎల్లాఉండేదోగాని, నాకుమాత్రం ఇల్లా బ్రతకడం చాలా అసహ్యం. నేనిప్పుడు చెప్పబోయే వృత్తాంతంవిని నీవు కళ్ళెఱ్ఱజేస్తావు. నన్ను తిడతావు. కళంకిని నంటావు. ఏమన్నా పరవాలేదు – నాలుగురోజు లవుతుంది. నేను కులటలాగ ఒక క్రొత్త అభినయం చేశాను. మే మిద్దఱం సినీమా చూడటానికి వెళ్ళాం. అక్కడ నా ప్రక్కనే ఒక బంగాళీబాబు కూర్చొని ఉన్నాడు. వినోద్ సినీమాలో ధ్యానావస్థలో ఉన్నట్లు కూర్చుంటారు. కులకరు; పలకరు. 'ఫిలిం బాగుంది. యాక్టింగ్ సజీవంగా ఉంది.'అని నా నోట మాటిమాటికి ప్రశంసాశబ్దాలు వస్తున్నాయి. బెంగాలీబాబుకుకూడా ఆనందం కలిగింది. మేమిద్దఱం ఫిలింమీద సమీక్షలుచేయటం ప్రారంభించాం. అతడు ఫిల్ములోని భావాలు మనస్సు ముగ్ధమయిపోయేలాగ వ్యాఖ్యానిస్తున్నాడు. ఆయన మాటలలో ఫిల్ముకంటే ఎక్కువ మజా కనిపించింది. చెల్లీ! నిజం చెప్పుతున్నాను. అందాని కతడు వినోద్‌గోటికి పోలడు. కాని వినోద్‌ను ఏడిపించాలనే, నే నతనితో నవ్వుతూ మాట్లాడటం ప్రారంభించాను. ఏదో పిట్ట దొరికిందని వా డనుకొన్నాడు. 'ఇంటర్వెల్'లో అతను బయటకు వెళ్ళబోతే నేనూ లేచి నుంచున్నాను. వినోద్ మాత్రం అలాగే కూర్చున్నాడు.

నే నన్నాను – 'అవతలికి వస్తారా! కూర్చొని కూర్చొని నడుం లాగుతోంది.'

"ఆఁ. ఆఁ. సరు. అటుయిటు తిరిగివద్దాం" అన్నాడు వినోద్. "మీరు రావాలని లేకపోతే వద్దు. నేను బలవంతం చెయ్య" నన్నాను నిరభ్యంతరంగా.

వినోద్ అక్కడే మళ్ళీ కూర్చుంటూ 'సరే' అన్నాడు.

ఇవతలకివచ్చాక బెంగాలీబాబు 'మీదీపూరేనా! అన్నాడు.

'మా ఆయన ఇక్కడ యూనివర్సిటీలో ప్రొఫెసరు ?

'ఉహూ !! ఆయన మీ ఆయనా ? బలేవాడు.

మిమ్మల్ని బహూశః ఇక్కడ వెనకే చూచిఉంటాను?

'అవును (నా మకాం బెంగాల్లో) మాది బెంగాల్. కాంచన పూర్ మహారాజా వారి ప్రయివేటు సెక్రెటరీని. మహారాజా వారు వైస్రాయిని కలియటానికి వచ్చారు.

'అయితే రెండు మూడు రోజులుంటారు'

అవునండి. అల్లాగే అనుకొంటున్నాను. ఉంటే సంవత్సర మంతా ఉండిపోతాను. మా మహారాజుగారికేదీ స్థిరం లేదు. మంచివారు. సోషల్ గా ఉంటారు. మిమ్మల్నిచూస్తే చాలా సంతోషిస్తారు.

ఇల్లా మాట్లాడుకొంటూ మేము 'రెస్టురెంటు'కి జేరాము. అతడు టీ, టోస్టు తీసుకొన్నాడు. నేనుమాత్రం టీ తీసుకొన్నాను. 'అయితే ఈ పట్టులోనే మీకు మహారాజుగారిని పరిచయం చెయ్యనా ! కిరీటధారల్లోకూడా ఇంత వినయము, నమ్రత ఉంటాయా అని మీ కాశ్చర్యం కలుగుతుంది. ఆయన మాటలువింటే మీరు ముగ్ధులైపోతారు! నేను అద్దంలో నా

ముఖం చూచుకొని అన్నాను-వద్దులెండి. 'మరొకప్పుడెప్పుడో ఏర్పాటు చేద్దుబుగాని. మీతో కలుస్తూనే ఉంటాగా! మీ ఆవిడ మీతో రాలేదా?'

యువకుడు చిరునవ్వునవ్వి అన్నాడు - 'నే నింకా అవివాహితుణ్ణే. బహుశః ఇల్లాగే ఉంటాను.'

నేను ఉత్సాహంతో అడిగాను - అయితే మీరుకూడా ఆడవాళ్ళంటే పారిపోయే జీవాల్లోవారే నన్నమాట. ఇంతకీ మీ పేరు తెలుసుకోలేదు! ఆయన తన పేరు 'భువనమోహన దాసుగుప్త' అని చెప్పాడు. నేను నా పేరు చెప్పాను.

'అది కాదండి! ఒకమాటు నిరాశజెంది ఇంకాగోడవ విడిచిపెట్టే అభాగ్యులలోవాణ్ణే నేను. లోకంలో రూపానికి లోటు లేదు. కాని రూపం, గుణం కలసిఉండటం చాల తక్కువగా కనిపిస్తూంది. నేను ప్రేమించిన రమణి ఇప్పుడొక వకీలు ధర్మపత్ని. నేను బీదవాణ్ణి. అందుచేత బ్రతికివున్నంతకాలం ఈ మరవరానిశిక్ష పడింది నాకు. ఒక సంవత్సరంపాటు ఎవర్ని ఉపాసించానో ఆమె నన్ను డబ్బుకి బలిదానం చేసిందంటే ఇంకిప్పుడేమి ఆశపెట్టుకోను!

నేను నవ్వి అన్నాను - 'మీరు చాలాత్వరగా అధైర్యపడ్డారు.'

భువనగుప్త ఎదుటగుమ్మంవైపుకి చూస్తూ అన్నాడు. 'నే నింతవఱకు స్త్రీలచే తిరస్కరింపబడని ఏ వీరుణ్ణీ చూడలేదు. వీరు హృదయంమీద దెబ్బకొడతారు. హృదయం ఒకటే గాయం సహిస్తుంది. నా ప్రేమను తుచ్ఛంగా భావించి కాలి

క్రిందపెట్టి రాచేసిన రమణికి, నా కళ్ళకి డబ్బెంత తుచ్ఛమైనదో చూపించాలని చూస్తున్నాను. ఇదే నా జీవితంలో ఏకైకమైన ఉద్దేశ్యం. విమలయింటియెదుట నా విశాలభవనం ఉన్ననాడే, ఆమెభర్త నాతో మాట్లాడటమే తనసౌభాగ్యమనుకొన్ననాడే నా జీవనం సఫలం అవుతుంది!'

నేను గంభీరంగా అన్నాను. 'ఇదేమీ ఉన్నతాశయంకాదు. విమల కేవలం ధనంకోసమే మిమ్మల్ని విడిచిపెట్టిందని ఎందుకనుకుంటున్నారు?అందుకుమరొక కారణంకూడా ఏదైనా ఉండవచ్చు. తల్లిదండ్రుల బలవంతంవల్లగాని, తనలోనే ఏదేనా లోపముండి, దానివల్ల మీ జీవితం దుఃఖమయ మవుతుందని గాని కావచ్చు. ఏ ప్రేమవల్ల వంచితులై మీరింత దుఃఖిస్తున్నారో, ఆ ప్రేమచేతనే వంచితురాలై ఆమె సుఖిస్తూఉంటుందని మీరెల్లా అనుకొంటున్నారు? ఎవరినైనా ధనికురాలుని జూచి మీరూ కరిగిపోవచ్చు.'

భువన్ ఘోర్సుగా అన్నాడు–'అసంభవం. ఎప్పటికీ సంభవం కాదు. నే నామెకోసం త్రైలోక్య రాజ్యమైనా నిజంగా త్యాగం చేద్దును.'

నేను నవ్వుతూ అన్నాను.—'అవును, మీరు ఇప్పుడిల్లాగే అంటారు. కాని అటువంటి పరీక్షలో పడినప్పుడు మీ పరిస్థితి ఎలా ఉంటుందో నిర్ణయంగా చెప్పలేము. సిపాయి శౌర్యానికి నిదర్శనము అతని కత్తిగాని నాలుకకాదు. మీ రా సమస్యలో పడకపోవటం మీ అదృష్టమనే అనుకొండి. ప్రత్యాఘాతాన్ని శరణుపొందినప్రేమ ప్రేమ కాదు. ప్రేమకు ఆదీ,

అతితమూ కూడా సహృదయతే. ఇప్పటికీ విమలవిషయంలో మీరే హాస్యాస్పదులు కాగలిగిన విషయమేదో మీకు తెలియవచ్చు!'

భువన్ బాగా దీర్ఘాలోచనలో పడ్డాడు. ఒకనిమిషమయ్యాక తలెత్తి, 'మిసెస్ వినోద్! మీకు ఇంతవఱకు నాకు తట్టనే తట్టని విషయాన్ని స్ఫురింపజేశారు. ఈ భావమెప్పుడూ నా హృదయాని కేమాత్రం కలగనే లేదు. నేనింత 'అనుదారుడ' నెందుకయ్యానో తెలియటం లేదు. ప్రేమయొక్క ఉన్నతాదర్శాన్ని స్త్రీలే పాలించగలరని నాకు నేటికి తెలిసింది. పురుషుడెన్నటికీ ప్రేమకోసం ఆత్మసమర్పణ చేయనేలేడు. అతడు తన స్వార్థం, వాసన అనేవాటినుంచి ప్రేమను వేరుచేయలేడు. ఇంక నా జీవనం సుఖమయమైపోతుంది. మీ రీ వేళ నాకు బోధించినందుకు ధన్యవాదాలు.' అంటూనే భువన్ ఉలిక్కిపడ్డాడు —'అరెర్రె! నే నెంత మూర్ఖుణ్ణి. రహస్యమంతా ఇప్పుడర్థమయింది. ఇంక తెలియని విషయం లేదు. అబ్బ! నేను విమల కెంత ఘోరమైన అన్యాయంచేశాను! గొప్ప అన్యాయం. నే నంధుణ్ణయిపోయాను. విమలా! నన్ను క్షమించు!'

భువన్ ఈ రీతిగా చాలాసేపు విలపిస్తూఉన్నాడు. మాటిమాటికి నాకు ధన్యవాదాలు చెప్పటం, తన మూర్ఖతకు పశ్చాత్తాప పడటమూను. ఎప్పుడు గంటకొట్టారో! మళ్ళా ఆటెప్పుడు ప్రారంభమయిందో అయింది. మా కా ధోరణే లేదు. వినోద్ తిన్నగా మేమున్న గదిలోకి వచ్చారు. నే నులికిపడ్డాను. నే నాయనముఖం చూచాను. ఏ భావమూ లేదు. అన్నారు-

'నీ వింకా ఇక్కడే ఉన్నావా పద్మా! ఆట ఆరంభమై ఏ ర్పూ న్నైంది? నే నిదంతా వెదికాను నీ కోసం!'

నేను కంగారుపడి లేచాను—ఆట ప్రారంభమయిందా? గంట చప్పుడు వినిపించనే లేదు.

భువన్ కూడా లేచాడు. మేము మళ్ళీవచ్చి చూచాము. వినోద్ ఇప్పుడేమన్నా నాకు కష్టం కలిగించే మాటలు రెండు మూడు అనిఉన్నా, అధమం ఆయనకళ్ళలో క్రోధసూచన కనిపించినా, నా అశాంతిహృదయం శాంతించేది. నా మనస్సుకి ఎంతో ధైర్యం కలిగేది. కాని ఆయనయొక్క ఆ అవిచిలిత విశ్వాసముందే, అది నన్నింకా వికలం చేసేసింది. సోదరీ! ఆయన నా మీద శాసనంచేయాలని నాకుంటుంది. నే నాయన కఠోరత, ఉద్దండత, బలిష్ఠత చూడాలనుకొంటాను. ఆయన ప్రేమ ప్రమోదవిశ్వాసాల రూపం చూచేశాను. దీనివల్ల నాకు తృప్తి కలగటం లేదు. తనకొడుక్కి బాగా తిండిపెట్టి, గుడ్డయిచ్చి, వాడి విద్యాబుద్ధులసంగతే పట్టించుకోక, వా డిష్టం వచ్చినట్టు సంచరించనిచ్చి, ఏం చేసినా ఊరుకొని, ఎప్పుడూ కళ్ళైనా ఎర్రజేయకుండా ఊరుకొన్న తండ్రిని నీవేమంటావు? ఇల్లాంటి కుఱ్ఱవాడు తప్పక చెడిపోతాడు. నాకూ ఆ పరిస్థితే కలుగుతోంది. ఈ ఔదాసీన్యం నా కసహనంగాఉంది. ఈ మానవుడు 'భువన్ ఎవరు?' అనే ప్రశ్ననైనా వేయలేదు. ఈమెభర్త కీమె ఎల్లాఉన్నా పరవాలేదనుకోడూ భువన్ గుప్త? తాను స్వతంత్రంగాఉండి నన్నుకూడా స్వేచ్ఛగా విడిచిపెట్టాలని వినోద్ ఊహ. నా పనిలో దేనిలోకూడా కలగజేసికోవా

లని ఉండదాయనకి. నేనుకూడా తన విషయాల్లో కలగజేసుకో కూడదని ఆయనఉద్దేశం. కాని నేనీ స్వాతంత్ర్యం ఉభయులకీ విషతుల్యమే అంటాను. లోకంలో స్వాతంత్ర్యాని కెంతవిలువ ఉన్నా, సాధారణంగా యింటిలోమాత్రం పరాధీనతే వికసిస్తూ ఉంటుంది. నా ఆహారముందంటే దాన్ని నాదని నే నెలా అనుకొంటానో, అలాగే వినోద్ కూడా తన దనుకోవాలి. కాని నన్నడగకుండా దాన్ని ఆయనెవరికైనా ఇచ్చే స్తేమాత్రం నేను పోట్లాడతాను. ఇల్లా నా మీద ఆయనకీ, ఆయనమీద నాకు, అధికార ముండాలనే నా కోరిక. ఆయన నా ప్రతివిషయాన్ని పరిశీలించాలి. నే నెవరితో కలిసేదీ, ఎక్కడికి వెళుతూఉన్నదీ, ఏమి చదువుతూఉన్నదీ, ఎల్లా జీవిస్తుఉన్నదీ ఆయన తీవ్ర దృష్టితో పరిశీలించాలన్నమాట. ఆయన నన్ను లెక్కజేయ నప్పుడు నే నాయన్నెందుకు లెక్కజేయాలి? ఈ గొడవ లోనే మే మొకరికొకరం చాలాదూరమైపోతున్నాము. ఇంకేం చెప్పను! ఆయ నే మిత్రులకు రోజూ ఏ ఉత్తరాలు వ్రాస్తు న్నారో నాకు తెలియదు. ఆయనకూడా నన్నెప్పుడూ ఏమీ అడగలేదు. సరే; నేనేం వ్రాస్తునానను? ఏం చెప్పకుపోతు న్నాను? వినోద్ నన్నేమీ అడగలేదు. నేను మళ్ళీ భువన్ తో ఫిల్మునుగురించి చర్చ ప్రారంభించాను.

ఆటయిపోయి మే మివతలికివచ్చి బండి మాట్లాడుకొంటూ ఉండగా భువన్ 'నా కార్లో తీసుకువెడతాను రండి' అన్నాడు. మే మేమీ అభ్యంతరం చెప్పలేదు. మా ఇంటి 'ఎడ్రస్'అడిగి భువన్ కారునడిపాడు. దారిలో నేనుభువన్ తో మాట్లాడుతూ రేపు మధ్యాహ్నం మా యింటికి భోజనానికి రావాలన్నాను.

భువన్ 'సరే'నని ఒప్పుకొన్నాడు. మమ్మల్ని దిగబెట్టి వెళ్ళిపోయాడు. కాని నా మనస్సు చాలసేపు అతనిమీదే ఉండేది. ఈ రెండుమూడు గంటలలోను భువన్ నర్థంచేసుకొన్నంతగా వినోద్‌ని నేటిదాకా అర్థం చేసికోలేకపోయాను. నేనుకూడా అంతరంగికవిషయా లీతనికి చెప్పినంతగా, వినోద్‌తో నేటికీ చెప్పలేదు. ఏ పురుషుడైనా నామీదకు దృష్టి ప్రసరింపజేస్తే అతన్ని చంపేసేటట్టు, ఎవరితోనైనా నేను నవ్వుతూ ఉండగా చూస్తే నా రక్తం త్రాగేటట్టు, అవసరమైతే నాకోసం నిప్పులో దూకేటట్టు ఉండే మనుష్యులలోవాడు భువన్. ఇటువంటి పురుషుని చరిత్ర నా హృదయంపై విజయం పొందగలదు. నా హృదయంపైనే కాదు. నారీజాతి (నా ఉద్దేశ్యంలో) ఇటువంటి పురుషునికోసమే ప్రాణమిస్తుంది. ఆమె నిర్బలమైనది. బలవంతుని ఆశ్రయం కోరుతుంది.

చెల్లీ! నీకు విసుగెత్తి ఉంటుంది. ఉత్తరం చాలా పెద్దదయింది. కాని ఈ కాండ పూర్తి కానిదే నే వదలలేను. నేను ఉదయంనుంచే భువన్‌కి విందు ఏర్పాటు ప్రారంభించాను. వంటవాడు వట్టి దద్దమ్మ. పనిఅంతా నా చేతులతో నేనే చేశాను. వంటచేయటంలో అంతఆనందం నాకు మరెప్పుడూ లభించలేదు.

భువన్ బాబుకారు సరిగ్గా టయిముకి వచ్చేసింది. భువన్ తిన్నగా నా గదిలోకి వచ్చాడు. రెండుమాటలు మాట్లాడాము. 'డిన్నర్ టేబులు' దగ్గఱకు వెళ్ళికూర్చున్నాము. వినోద్ కూడా భోజనానికి వచ్చారు. నేను వా రుభయులకు

పరస్పర పరిచయం చేశాను. వినోద్ భువన్‌అంటే కొంచెం ఉదాసీనత కనబరచినట్లు తోచిందినాకు. ఈయనకి రాజులన్నా, జమీందారులన్నా గిట్టదు. సామ్యవాది. రాజులైతేనే కోపమైనప్పుడు వాళ్ళ నౌకర్లంటే ఎందుకుండదు! ఈ ధనికుల దర్బారులలో విలాసపురుషులు, పనికిమాలినవారు, సిద్ధాంతహీనులు, చరిత్రహీనులు ప్రోగుపడతారని. వాళ్ళ కింతకంటే పని ఉండదనీ, తమ ప్రభువుకోరిక మంచిదైనా చెడ్డదైనా నెరవేర్చటమేననీ, ప్రజలగొంతుక కోసి తమ ఇళ్లు నిండేసుకోవటమే వాళ్ళపననీ ఆయన ఉద్దేశం. భోజనం చేస్తూఉండగా సంభాషణ సాగిసాగి తుదకు వివాహము-ప్రేమవంటి మహావిషయాల మీదకి మళ్ళింది.

వినోద్-'అహం. నేను వర్తమాన వైవాహిక ప్రథ (ఆచారం) మెచ్చుకోను. మనుష్యుడు సభ్యత కారంభదశలో ఉన్నప్పుడీ ఆచారం అవిష్కృతమైంది. అప్పటినుండి లోకం చాలా ముందుకు వచ్చింది. కాని వివాహాచారంలో కాస్త కూడా భేదం లేదు. ఈ ఆచారం వర్తమాన కాలాని కుపయోగకరంకాదు.'

భువన్:- 'ఇంతకీ మీ కి[redacted]

వినోద్ ఆలోచించి అన్నాడు - 'ఇందులో అన్నిటికంటే మొదటి తప్పేమిటంటే - ఇది సాంఘిక సమస్యకు ధార్మిక రూపమిస్తోంది.'

'మఱి ఒకటి?'

రెండవది—ఇది వ్యక్తి స్వేచ్ఛకు బాధకం. ఇది స్త్రీ వ్రతం, పాతివ్రత్యం అనేది కల్పించి మన ఆత్మను సంకుచితం చేస్తోంది. దీనివల్ల మన బుద్ధివికాసానికి కలిగిన ఆటంకం మరే యితర భౌతిక క్రాంతి వల్లగాని, దైవిక విప్లవం వల్లగాని కలుగలేదు. ఇది మిథ్యా ఆదర్శాలని మనఎదుట పెట్టింది. మనం ఇంకా ఆ పాతవే, లజ్జాకరమైనవే, పాశవికమైనవే పట్టుకు కూర్చున్నాం గీటుదాటకుండా. వ్రతం కేవలం ఒక నిరర్థక బంధనానికి పేరు. ఇంత మహా నామధేయం పెట్టి మనమా కైదుకి ధార్మికరూపం ఇచ్చాం. స్త్రీ తనని ఈశ్వరుడని, తన సర్వస్వమని భావించాలని పురుషు డెందుకు కోరుతున్నాడు? అతడామెను పోషిస్తున్నాడనేనా? స్త్రీ కర్తవ్యం కేవలం పురుషుని సంపత్తుకి వారసుల్ని పుట్టించడమేనా? భర్త దేహాంతమైనాక తనకు దానిమీద హిందూ ధర్మశాస్త్రానుసారం అధికారమేనా లేని సంపత్తుకి. ఈ సర్వసాంఘిక వ్యవస్థ, ఈ కల్పన అంతా సంప్రదయుణ మీదే ఆధారపడి ఉంది. ఇది సంపత్తును ప్రధానము పురుషుణ్ణి అప్రధానము చేసి పారేసింది. 'మన వీర్యంచేత ఉత్పన్నమైన సంతానమే మనం సంపాదించిన ఆస్తి అనుభవించాలి'. అనే మనోభావంలో ఎంత స్వార్థాంధత, ఎంతదాసత్వము దాగిఉన్నాయో ఎవడూ చెప్పలేడు. ఈ కైదులో మగ్గివున్న సంఘసంతానం ఈ నాడు ఇంటా బయటాకూడా తన క్రూర స్వార్థంకోసం రక్తనదుల్ని పారిస్తోందంటే ఆశ్చర్యమేముంది? ఈ వైవాహిక ప్రథే అన్ని చెడుగులకీ కారణమని నా ఉద్దేశం.'

భువన్ ఆశ్చర్యపడ్డాడు. నామట్టుకు నేనెంతో విస్తుపోయాను. వినోద్ ఈ విషయంలో నాతో ఎప్పుడూ ఇంతస్పష్టంగా మాట్లాడలేదు. ఆయన సామ్యవాది అనిమాత్రం నాకు తెలుసు. ఒకటి రెండుసార్లా విషయంలో ఆయనతో వాదించాను కూడా. కాని వైవాహికవ్యవస్థకు ఈయన ఇంతవిరోధి అని నాకు తెలియదు. భువన్ ముఖం చూస్తే అతని కీ దార్శనిక విషయాలేమీ తెలియవని తెలిసిపోతూనేఉంది. కాసేపుండి అన్నాడు - 'ప్రొఫెసర్ గారూ! తమరు నన్నొక పెద్ద సుడి గుండంలో పడవేశారు. ఇంతకీ తమరీ ఆచారంస్థానే మఱి యొక ఆచారం ఏదైనా ఏర్పాటుచేయాలని చూస్తున్నారా? లేకపోతే పెళ్ళే అక్కరలేదంటారా? పశుపక్ష్యాదులలాగే మనమూ సంచరించాలా?'

వినోద్ వెంటనే జవాబిచ్చారు. 'కొంతవఱకు పశుపక్ష్యాదులలో అన్నిటి మానసికవికాసము ఒకరీతికాదు. జత నెన్ను కోవటంలో ఏమీ ఆలోచించనివి కొన్ని. ఒకమాటు పిల్లలు పుట్టాక విడిపోయేవి కొన్ని. యావజ్జీవం కలిసిఉండేవి మనుష్యుల కంటెచాలామంచివనుకొంటాను. కానిస్వేచ్ఛతో. వాటికేమీ కైదులేదు. ఏదీశిక్ష లేదు. అవి రెండూ ఆహారాన్వేషణ చేసు కొంటాయి. రెండూ కలిసి ఉండటానికి చోటు ఏర్పాటు చేసు కొంటాయి. కలిసిమెలిసి పిల్లలసంరక్షణచేస్తాయి. వాటిమధ్యకు మూడవది రానేలేదు. అదెంతవఱకూ అంటే, వాటిలో ఒకటిపోతే రెండవది తాను చచ్చిపోయేదాకా విధురజీవనం గడుపుతుంది. ఈ అంధకారం మనుష్య జాతిలోనూ ఉంది. స్త్రీ మఱొక పురుషునితో నవ్వుతూ మాటాడిందా, ఇక ఆమె

భర్తకు ఒళ్ళు మండిందన్నమాటే! హత్యచేసే ఆలోచనలు ప్రారంభమవుతాయి. పురుషుడే పరాయి ఆడదానివైపైనా రసికనేత్రాలతో చూచాడా, అర్ధాంగికి ఆగ్రహం వచ్చిందన్నమాటే! పతిప్రాణాలు తీయడానికి సంసిద్ధమవుతుంది. ఇదంతా యేమిటి? ఇటువంటి మనుష్యసమాజం సభ్యత కెల్లా పోటీ చేయగలదు?' భువన్ తలాడిస్తూ అన్నాడు-'మనుష్యులలో కూడా, భిన్నభిన్న శ్రేణులున్నాయి. కొందరు ప్రతిపెల్లా ఒక కొత్త జతను వెతుక్కుంటారు'. వినోద్ నవ్వి అన్నారు. 'కాని అదంత తేలికపని కాదు. కేవలం సంతానపోషణకోసమైనా ఎవరినో చేసుకోవాలి. లేదా, బోలెడుడబ్బైనా ఇవ్వగలిగి ఉండాలి.'

భువన్ కూడా నవ్వాడు - 'తమరు తమర్ని ఏ శ్రేణిలో జేర్చుకుంటారు?'

వినోద్ ఈ ప్రశ్నకు తయారుగా లేడు. ఇది అర్థంలేని ప్రశ్న కూడాను. చలిస్తూ అన్నారు - 'పరిస్థితులు రెండులోకి లాక్కుపోతే అందులో. నేను స్త్రీ పురుషుల కుభయులకు సంపూర్ణ స్వాతంత్ర్యానికి హామీని. నా మనస్సు ఏ యువతిచేత ఆకర్షింపబడినా, ఆమె కోరినా, నేను సంఘానికి భయపడి ఆమెవైపు చూడలేక పోవటానికి హేతువులేదు.'

భువన్ చెప్పే జవాబేమీ వినకుండానే, వినోద్ లేచి నుంచున్నారు. కాలేజీకి ఆలస్యం అయిపోతోంది. గబగబా బట్టలు కట్టుకొని వెళ్ళిపోయారు. మేమిద్దరం సావిట్లోకివచ్చి మాట్లాడుకొన్నాం. భువన్ సిగరెట్టు వెలిగిస్తూ అన్నాడు.

'చూశారా ? ఎంతవరకు వచ్చిందో !' నేను సిగ్గుపడి తలవంచు కొన్నాను. ఏం జవాబు చెపుతాను ? వినోద్ చివరిమాట నా హృదయానికి కఠోరాఘాతం కలిగించింది. వినోద్ నన్ను దృష్టిలో పెట్టుకొనే ఈ వివాహరీతికి క్రొత్తఖండన తయారు చేసిఉంటా రనుకొంటాను. ఆయన నా పీడ వదల్చుకోవా లనుకొంటున్నారు. ఆయ నే రమణికోసమో చూస్తున్నారు. నే నంటే ఆయనకు విసుగెత్తింది. ఆ ఆలోచన వచ్చేసరికి నాకు చాలా దుఃఖంవచ్చింది. నా కళ్ళనుండి నీళ్ళుకారాయి. ఒంటరిగా ఉంటే ఏడ్చేదాన్ని కానేమోగాని, భువన్ ఎదుట నేను నిగ్రహించుకోలేకపోయాను. భువన్ నన్ను చాలా ఓదార్చాడు—'మీ రనవసరంగా దుఃఖిస్తున్నారు. మిష్టర్ వినోద్ మిమ్మల్ని గౌరవించకపోయినా, మీ కనుసన్నకు తన ప్రాణాలసైతం బలివ్వగలవాడు, కనీసం ఒకవ్యక్తి ఈ లోకంలో ఉన్నాడు. మీలాంటి రమణీరత్నాన్ని పొంది తన అదృష్టానికి మురిసిపోని మానవు డెవడీ లోకంలో ? మీ రీ విషయంలో ఏమీ విచారించకండి.'

నాకు భువన్‌మాట అసహ్యమైంది. బాగా కోపంవచ్చి నా ముఖం కందిపోయింది. ఈ ధూర్తుడు నా దౌర్బల్యాన్ని ఆసరాచేసుకొని నన్ను నాశనం చేద్దామని చూస్తున్నాడు. నా దౌర్భాగ్యానికి నాకు ఏడుపు వస్తోంది. ఇంకా పెళ్ళయి యేడాదికాలేదు. అప్పుడే ఇతరులకు నన్ను మోసగించడానికీ, నా మీద ఇంద్రజాలం ప్రయోగించడానికీ సాహసం కలుగు తోంది. నాకీ దశ పట్టింది. నేను వినోద్‌ను చూచినప్పుడు నా హృదయం ఎంత ఉప్పొంగింది ! నా హృదయాన్ని నే

నెంత భక్తితో ఆయనచరణాల కర్పించాను! కాని నే నింత త్వరలో ఆయన నేత్రాలలోనుంచి జారిపోతాననీ, నన్ను పరిత్యక్తగా భావించి వ్యభిచారులు నాకు వలలు పన్నుతారనీ ఏ మెరుగుదును ?

నేను కళ్ళు తుడుచుకొంటూ అన్నాను - క్షమించండి. నన్ను కాస్త విశ్రాంతి తీసుకోనియ్యండి.

'ఆ; ఆఁ. మీరు విశ్రాంతి తీసుకోండి. నేనిక్కడ కూర్చొని చూస్తూఉంటాను.'

'కాదండి; మీరు దయయుంచి వెళ్ళండి. నాకిల్లా విశ్రాంతి లభించదు.'

'మంచిది. మీరు విశ్రాంతి తీసుకోండి. నేను సాయంకాలంవచ్చి చూసివెడతాను.'

'అక్కరలేదండి. తమరు కష్టపడనక్కరలేదు.'

'సరే; అయితే రేపు వస్తాను. బహుశః మహారాజావారు కూడా రావచ్చు.'

'అబ్బే! మీరు నా ఆహ్వానాని కెదురుచూడకండి. పిలువకుండా రాకండి' అనిచెపుతూనే లేచి పడకగదిలోకి పోయాను. భువన్ ఒక క్షణంసేపు నావైపుచూస్తూఉన్నాడు. తర్వాత మాట్లాడక వెళ్ళాడు.'

చెల్లీ! రెండురోజులు గడిచాయి. కాని నేను గదిలోంచి ఇవతలకు రానేలేదు. భువన్ రెండుమూడు సార్లు వచ్చాడు. కాని నేనతన్ని కలవనని చెప్పేశాను. ఇప్పుడతనికి బహుశః

మళ్ళీ వచ్చే సాహసం ఉండదు. ఈశ్వరుడు చాల ప్రమాద స్థితిలో నాకు బుద్ధి కలిగించాడు. లేకపోతే ఈపాటికి నేను నాసర్వస్వం నాశనంచేసుకు కూర్చునేదాన్ని. వినోద్ తరచుగా నాదగ్గరే కూర్చుంటున్నారు. కాని ఆయనతో నాకు మాట్లాడాలనుండటంలేదు. వ్యభిచారాన్ని దార్శనిక సిద్ధాంతాలతో సమర్థించి, వివాహమువంటి పవిత్ర వ్యవస్థకు తనదృష్టిలో యేమీ విలువలేక, తాను నావాడు కాలేక, నన్ను తనదాన్ని చేసుకోలేక, వ్యవహరించేవానితో నా లాంటి మానిని, గర్విణే యైన స్త్రీకి ఎన్నాళ్ళు నిర్వాహకమవుతుంది ?

సరే, ఇంక సెలవు; క్షమించు—నేను నీ అమూల్య సమయాన్ని ఛాలా తీసుకున్నాను. కాని ఇదిమాత్రం గుర్తించు. నేను నీ దయకాదు కోరేది; సానుభూతి.

నీ పద్మ



# 10

కాశీ, 5-1-26.

ప్రియ సోదరీ !

నీ ఉత్తరం చదివి ఏదోనవల చదివేసి లేచినట్లు భావించాను. నీవుకనక నవల వ్రాస్తే, దానికి మంచి ప్రచారం వుంటుందని నా విశ్వాసం. నీవుస్వయంగా నాయికవు కావాలి. నీ విల్లాంటిమాట లెక్కడ నేర్చుకున్నావని! నా కాశ్చర్యం

వేస్తుంది. నీ వా 'బంగాలీ'తో ఒంటరిగా ఎల్లా మాట్లాడుతూ కూర్చున్నావో నా కర్థం కావటంలేదు. నేనుమాత్రం ఎన్న టికీ అల్లా చేయలేను. నీవు వినోద్‌ని ఏడ్పిద్దామని, ఆయనకి చిత్తశాంతి లేకుండా చేద్దామని చూస్తున్నావు. అయ్యో పాపం! నీవు ఆయన కెంత అన్యాయం చేస్తున్నావు! వినోద్ నిన్ను పేక్షిస్తున్నాడని, నీ సంగతే పట్టించుకోనంతగా తన ఆలో చనలో తా నుంటాడనీ నీ వెందు కనుకుంటున్నావు ? 'అత డే మనోవ్యథతో బాధపడుతున్నాడో' అనెందుకనుకోవు ! జీవనసాధారణ విషయాల్లో ఆయన కభిరుచి లేనంతగా ఆయ న్నే సమస్యలు, ఏ భీతి చుట్టుముట్టాయోఅని నీ వెందు కాలో చించవు ? ఆయ నే దార్శనికతత్వాన్నో అన్వేషిస్తూ ఉండ వచ్చు. ఏదో 'థీసిస్' వ్రాస్తూ ఉండవచ్చు. అది ఎవరు చెప్ప గలరు ?

నీవంటి రూపవతిని పొందికూడా ఏ మానవుడైనా చింతిస్తున్నాడంటే–గుర్తించు. అతని హృదయంలో ఏదో భారముందన్నమాట. ఆయనకు నీ సానుభూతి అవసరం. నీ వాయన బరువు తగ్గించగలవు. కాని దానికిబదులు నీ వాయ నకే దోషం కల్పిస్తున్నావు. ఒకనాడు నీవు హృదయమిచ్చి వినోద్‌తో ఎందుకు మాట్లాడుకోలేవో నా కర్థం కావటం లేదు. సందేహాన్ని సాధ్యమైనంత త్వరలో తొలగించు కోవాలి. తొందరలో తగినఉపచారం పొందకపోతే బ్రహ్మ రాక్షసి అయ్యే కోతిపుండులాంటిది సందేహం. రెండు రోజు లుండేలాగ ఇక్కడికి రారాదూ! నువ్వే రారాదా అంటూ

వేమో? నేను స్వతంత్రతను కాను. అత్తమామల నడగందే ఏ పనీ చేయలేను. నీకైతే ఏ బంధనము లేదు.

అక్కా! ఈమధ్య నా జీవితం హర్షశోకాల మిశ్రమణంగా ఉంది. ఒంటరిగాఉంటే ఏడుస్తున్నాను. 'ఆనంద్' వస్తే నవ్వుతున్నాను. ఆయనెప్పుడూ నాదగ్గరే కూర్చుంటే బాగుండు ననిపిస్తుంది. కాని రాత్రి పన్నెండుగంటలకిపూర్వ మాయన దర్శనంకాదు. ఒకనాడు మధ్యాహ్నం వారువస్తే అత్తగారెల్లా కోపపడిందనుకొన్నావు! చిన్నపిల్లవానిని బెదరించినట్లే. అత్తగారికి నేనంటే ఏదోకోపం ఉందని భయంవేస్తోంది నాకు. అక్కా! నేను చేతనైనంతవఱ కామెను సంతోషపెట్టే చేష్టలే చేస్తున్నాను. ఎన్నడూచేయని పనులుకూడా ఆమెకోసం చేస్తున్నాను. ఆమెస్నానానికి నీళ్ళు కాస్తున్నాను. ఆమెపూజకు కావలసినవన్నీ సిద్ధపరుస్తున్నాను. స్నానంచేస్తే అచకఉతుకుతున్నాను. పడుకొన్నప్పుడు కాళ్ళు పడుతున్నాను. నిద్రపోతుంటే పంకావేస్తున్నాను. ఆమె నా తల్లి. ఆమె గర్భంనుంచే నా ప్రాణాధారమైన రత్నం ఉత్పన్నమైంది. ఆమెకే కొంచెమో సేవ చేయగలగటంకంటె నా కదృష్టమేముంది? నాతో నవ్వుతూ మాట్లాడితే అంతేచాలు. కాని అమెగమక్క- నన్ను తిడుతూనేఉంటుం దెందుకో అర్థంకాదు. తప్పు నాదే అని తెలుసు. కాని అదేమిటో తెలియటంలేదు. మా ఆడబడుచు లిద్దఱికంటె నే నందమైన దాన్నవటమే, చదువుకొన్న దాన్నవటమే నా తప్పయితే, ఆనంద్ నామీదింత ప్రేమగా ఎందుకుండాలి? అంటే అది నా వశంకాని విషయం. అత్తగారు నా విషయంలో ఇల్లా ప్రవర్తించటంచూచే ఆనంద్

తల్లికి దూరంగా ఉంటున్నారు. నేనే ఆనంద్ మనస్సును విరిచేస్తున్నానని అత్తగారికెందుకో భ్రమ కలుగుతూఉంటుంది. దీన్నెందుకు కోడలిని చేసుకొన్నామా అని బహుశః ఆమె పశ్చాత్తాపపడుతూ ఉండవచ్చు. తననుంచి తనకొడుకు నెక్కడ లాగేసుకుంటానో అని భయపడుతోంది. ఒకసారి నన్నామె గారడీదాన్ననికూడా అంది. ఇద్దరు ఆడబడుచులూ అకారణంగా నాయందు ఎంతో ద్వేషం చూపుతూఉంటారు. పెదాడబడుచు వితంతువు. సరే ఆమెకోపం అర్థమవుతోంది. కాని చిన్నావిడ ఇంకా కన్య. ఆమెకాద్వేష మెందుకో నా కర్థంకావటంలేదు. నేనే ఆవిడస్థానంలో ఉంటే నా వదినగారిదగ్గ రేవోకొంచెం నేర్చుకోవటానికి, చదువుకోవటానికీ ప్రయత్నం చేసేదాన్ని. ఆమె కాళ్ళు కడిగి నెత్తినుంచుకొనేదాన్ని. కాని ఈ పిల్లకి నన్నవమానపరచటమే ఆనందం. కొద్దిరోజులలోనే ఇద్దఱూ కూడా సిగ్గుపడతారని నాకు తెలుసు. ఆఁ ఇప్పుడే నేనంటే కొంచెం బెదురుతారు. నేను నావల్ల వాళ్ళకి అప్రసన్నత కలిగే ఏ అవకాశం కలగనీయటంలేదు. కాని నా రూపాన్నేం చేయను ? ఒకనాటికి రూపమేకారణంగా, నే నపరాధి నవుతానని ఏమెరుగుదును ? నిజం చెప్తున్నాను. అక్కా ! ఒక మాదిరిగా ఇక్కడ నే నలంకరించుకోవటమే మానేశాను. మురికితో ఎంతో అసహ్యంగా తయారై కూర్చుంటున్నాను; ఈ భయంచేతనే. నేను చదువుకొంటున్నా, నన్నెవ్వరూ ముఖం చిట్లించనక్కరలేకుండా నే నసలు పుస్తకాలేముట్టుకోవడంలేదు. మా ఇంటిదగ్గరనుంచి పుస్తకాలొక మూటకట్టి తెచ్చాను. అందులో కొన్ని పుస్తకాలు చాల మంచివి. వాటిని చదవాల

నెన్నోసార్లు అనిపిస్తూ ఉంటుంది. కాని ఎవళ్ళేమంటారో అని భయం. నే నెల్లా కూర్చుంటున్నానో, ఏమి చేస్తున్నానో, ఎల్లా మాట్లాడుతున్నానో చూస్తూ గూఢచారుల్లా ఉంటారు నాకు మా ఆడబడుచులిద్దరూ. ఈ మహిళల కిద్దరికీ నా మీద కొండేలు చెప్పటమంటే ఇంత సరదా ఏమిటో చెప్పలేను. ఈ మధ్య బహుశః వాళ్ళకింతకంటే పనేలేనట్లుంది. నాకు ఒకసారి కసురుకుందామన్నంత కోపంవచ్చింది. కాని మనస్సు నణచుకొని ఊరుకొంటున్నాను. ఈ పరిస్థితి అట్టేరోజు లుండదులే. ఒక కొత్త మనిషితో మొదట కాస్త వింతగాఉండటం సహజమే. విశేషించి ఆ కొత్త వ్యక్తి విద్యాఆశయాల్లో మనకంటెకొంచెం భిన్నంగాఉంటే మరీను. నిజంగా నేనే ఏ ఫ్రెంచ్ లేడితోనైనా ఉండవలసివస్తే ఆమె ప్రతివిషయం ఆలోచనతోటే, కుతూహలంతోటే చూస్తాను.

ఈ కాశీపురవాసులు పూజలు, పునస్కారాలు చాలా చేస్తుంటారు. అత్తగారుమాత్రం రోజూ గంగకు స్నానానికి వెడతారు. పెద్దాడబడుచు ఆమెవెంట వెడుతుంది. నే నెప్పుడూ పూజచేయలేదు. జ్ఞాపకముందా? మనం పూజలు చేసేవాళ్ళ నెంత హేళన చేసేవాళ్ళమో? పూజచేసేవాళ్ల చరిత్ర ఉన్నతమైనదిగా నే నప్పుడు గ్రహించివుంటే నే నీ పాటికి పూజ చేస్తూఉండేదాన్ని. కాని నాకిలాంటి అనుభవం ఎప్పుడూ కలగలేదు. పూజచేసేవాళ్లుకూడా పూజ ఎప్పుడూ చేయనివాళ్లలాగే ఇతరులని నిందిస్తుంటారు. తమలో తాము పోట్లాడుకొంటారు. సరే, ఇప్పుడిప్పుడే నాకు మెల్లమెల్లగా పూజమీద శ్రద్ధ కలుగుతోంది. మా మామగారితండ్రి ఒక

గుడి కట్టించారు. అది మా యింటియెదుటే ఉంది. నేను తరచుగా మా అత్తగారితో కూడా అక్కడికి వెళుతూవుంటాను. అంతేకాక ఇప్పుడా విశాలమూర్తి దివ్యదర్శనంవల్ల నా అంతరంగంలో ఒక జ్యోతిలాగ అనుభవం కలుగుతోందని చెప్పటాని కేమీ సందేహంలేదు. నేను ఎంతశ్రద్ధతో రామకృష్ణుల జీవితాలని గురించి ఆలోచనచేస్తూ ఉండేదాన్నో! అదంతా పోయింది.

నేను రూపవతినైనందుకు శిక్ష ఇంతటితో పూర్తికాలేదు. మా ఆడబడుచులు నా రూపంజూసి అసూయపడుతున్నారంటే అర్థముంది. కాని ఊహించటానికి వీలులేని చోటునుంచి కూడా నాకీశిక్ష లభిస్తోంది. అందుకు నాకు విచారంగా ఉంది – నా ఆనంద్ బాబుకూడా నన్నిందుకు దండిస్తున్నారు. ఆం. ఆయన దండనీతి విలక్షణమైనది. ఆయన ప్రతి రోజూ నా దగ్గఱకేదో కానుక తెస్తూనే ఉన్నారు. ఆయన నాదగ్గఱ ఉన్నంతసేపూ తానుండటం నాకిష్టంలేదనే ఆయానసందేహం. ఆయనయందు నేను చూపే ప్రేమ కపటమనీ, కేవలం పైకి ప్రదర్శించేదే అనీ ఆయ ననుకొంటున్నారు. ఆయన నాదగ్గఱ అణకువగాను, అనుమానంగానూ ఉంటారు. దీనివల్ల నేను సిగ్గుపడిచస్తున్నాను. నాతో ఏదైనా చెప్పేటప్పుడు తన కధికారంలేని పని చేస్తూ ఉన్నట్టు ఊరికే సంకోచం. మురికిబట్టలు కట్టుకొనేవారు శుభ్ర వస్త్రాలుధరించే వాడికి దూరంగా ఉన్నట్లుం దీయనపరిస్థితి.

ఏ అందగత్తెకూ అందగాడుకాని మగవాడిమీద ప్రేమ ఉండనే ఉండదని ఆయ ననుకొంటున్నారేమో! బహుశః ఆయన దీన్నెందుకు పెళ్ళిచేసికొన్నామురా అని పశ్చాత్తాప

పడుతూ ఉండవచ్చు. ఆయనకు తనమీదే విసుగు కలుగుతుందేమో! నన్నెప్పుడైనా ఏడుస్తూఉండగా చూస్తే, నా దౌర్భాగ్యాన్ని తలుచుకొని ఏడుస్తున్నా ననుకొంటున్నారు. నేనే ఉత్తరమేనా వ్రాస్తుంటే యీయన రూపహీనతనే చెప్పుకుని ఏడుస్తున్నా ననుకొంటున్నారు. నేను ఏమి చెప్పను అక్కా! ఈ సౌందర్యం నా ప్రాణాలు తీస్తేదైంది. ఆనంద్ మనస్సులో ఈ అనుమానం పోగొట్టటానికీ, ఆయన్ని నా వల్ల తృప్తి పడేట్టు చేయటానికీ, అంత క్రితం నా కెంతో అసహ్యమైన ఆచరణలుకూడా ఇప్పుడు చేయవలసి వస్తోంది. మొదటే ఈ సంగతి తెలిస్తే నన్ను కురూపను చేయమని ఆ బ్రహ్మదేవుడితో చెప్పిఉండేదాన్ని. మహా చిక్కు వచ్చిపడింది. అత్తగారిని సేవించకపోయినా, ఆడబడుచుని గౌరవించకపోయినా వాళ్ళ దృష్టినుంచి జారిపోతున్నాను. ఆనంద్ బాబుకి నిరాశ కల్గించానా, ఆయన నా మీద పింక్తి పెట్టుకొంటారేమో!

నేను నీతో నా హృదయంలో ఉన్న సంగతి చెప్తున్నా నక్కా! నీ దగ్గిర దాపరికమేముంది? ఏ స్త్రీకైనా పురుషుడంటే ఎంత ప్రేమ ఉండటానికి వీలుందో, అంత ప్రేమా ఆనందబాబంటే నాకుంది. ఆయనస్థానే ఇంద్రుడు వచ్చినా కన్నెత్తి చూడను. కాని ఆయన కెల్లా నమ్మకం కలిగించను? చూస్తున్నాగదూ! ఆయనేదో ఒక వంకమీద మాటిమాటికి లోపలికి వస్తారు. వినమ్రమలాలసాపూరిత దృక్కులతో నా గదిగుమ్మంవైపు చూస్తారు. అప్పుడాయన చెయ్యిపట్టుకొని గదిలోకి లాక్కుందా మనిపిస్తుంది. కాని ఎవరైనాచూస్తే ఇంకేమన్నా ఉందా? అన్నిటికంటె కనభయ మేమిటంటే —

ఆయనే ఇదంతా నాటకమనుకొంటే! ఇంకా ఆయనసంపాదన తక్కువైనా, ఏవో రెండుమూడురూపాయలవి రోజూ తెస్తూనే వుంటారు. హృదయపూర్వక ప్రేమోపహారం ఎంత సామాన్యమైన దిచ్చినా కళ్లకద్దుకు తీసుకుంటాను. కాని ఆయన పన్ను కట్టినట్టు కడుతున్నారు; భగవంతు డాయన కీ శిక్ష విధించినట్టు. ఏం చెయ్యగలను? ఇప్పుడు నేనుకూడా ప్రేమనాటకం ఆడవలసి వస్తుంది. ప్రేమప్రదర్శనమంటే నా కసహ్యం. నీకు జ్ఞాపకముందా? నేనొకసారి చెప్పాను— 'ప్రేమఉంటే లోప లేనా ఉంటుంది; లేదా పైనేనా ఉంటుంది, లోపలా పైనా సమానంగా ఉండ లేదు. ప్రదర్శనం వేశ్యలకే. కులాంగనలకు ప్రేమ హృదయంలోనే వుంటుంది.'

అక్కా! ఉత్తరం చాలా పెద్దదయింది. చదివి చదివి విసుగెత్తి ఉంటుంది. నేను వ్రాసి వ్రాసి అలసిపోయాను. ఇంక మిగిలిన సంగతులు రేపు వ్రాస్తాను. ఎల్లుండి ఈ ఉత్తరం నీదగ్గఱకు చేరుతుంది.



అక్కా! క్షమించు. నిన్న ఉత్తరం వ్రాయటానికి టైము లేకపోయింది. రాత్రి ఒక సంఘటన జరిగింది. దానితో చిత్తం అశాంతమైంది. అతికష్టంమీద ఈ కొద్ది సమయాన్ని గడపగలిగాను. నే నింతవరకూ యింటిలోఉన్న ఏ ప్రాణినిగురించీ ఆనంద్‌తో పితూరీచేయలేదు. మా అత్తగారేదైనా మాట అన్నా, ఆడబడుచు సాధించినా ఆ సంగతి ఆయనదాకా ఎందుకు పోనివ్వటం? గృహకలహం పుట్టటంకంటే దీనివల్ల

కలిసివచ్చేదేమిటి? ఈ చిన్నచిన్న విషయాలు కడుపులో పెట్టుకొని ఉండకపోతే కుటుంబాలు చెడిపోతాయి. అన్యోన్యం వైమనస్యం ఎక్కువవుతుంది. కాని నిన్న అనుకోకుండానే నా నోట ఒకమాటవచ్చింది. అందు కింకా నన్ను నేనెంతో నిందించుకొంటున్నాను. అది యింక పెరగకూడదని దైవాన్ని ప్రార్థిస్తున్నాను. సంగతేమిటంటే నిన్న ఆనంద్ బాబు చాలా ఆలస్యంగా వచ్చారు-నేనాయనకోసం చూస్తూ ఒక పుస్తకం తీసి చదువుతూ కూర్చున్నాను. ఆపళంగా అత్తగారువచ్చి ఇంకా లైటు వెలుగుతోనే ఉందా? వాడు తెల్లవారేదాకా రాకపోతే నీవు లైటుంచుకూర్చుంటావా తెల్లవార్లూ? అంది. నేను లైటు తీసేశాను. ఆనంద్ బాబు కాస్సేపట్లో వచ్చారు. గది చీకటిమయంగా ఉంది. అదేమిటో నా కప్పుడు మందమతి ఏర్పడింది. [illegible] అలికిడి తెలియగానే నేను 'స్విచ్'వేస్తే ఏ గొడవా లేకపోయేది. కాని నే నంధకారంలో పడివున్నాను. ఆయనడిగారు—'నిద్రా! ఈ చీకటేమి'టని. అయ్యో! అప్పుడేనా నేను 'ఇప్పుడే తీశాను లైట'ని చెప్పివుంటే సరిపోయేది. కాని నా నోటివెంట 'అత్తగారు బల్బు ఆర్పేయమన్నారు; ఆరిపేశాను. మీరు తెల్లవారేదాకా రాకపోతే తెల్లవార్లూ బల్బు వెలుగుతూఉండాలా ?' అంటూ వచ్చాయి మాటలు'

'అయితే ఇప్పుడు వెయి స్విచ్. నేను వెలుతురులోనుంచి వస్తున్నాను. నాకేమీ కనిపించటంలేదు'అన్నారు.

'నేనిప్పుడు 'బటన్' ముట్టుకోనని ఒట్టు పెట్టుకొన్నాను. అవసరంవస్తే కొవ్వొవత్తి వెలిగించుకొంటాను. అనవసరంగా

చీవాట్లు ఎవరు తింటారు ?' ఆనంద్ స్విచ్చివేస్తూ అన్నారు. 'రాత్రి తెల్లవార్లూ బల్బు వెలుగుతూ ఉండవలసిందే అని నేను ఒట్టుపెట్టుకొన్నాను. ఎవరికి కష్టం కలిగినాసరే, అంతా చూస్తున్నాను. గ్రుడ్డివాణ్ణి కాదు. మఱియొక కోడలువచ్చి యింత సేవ చేసినప్పుడు చూస్తాను. నీవు దురదృష్టవంతురాలవుకనక ఈ ప్రాణుల చేతిలో పడ్డావు. మఱియొక అత్తగారికెవరికైనా నీవే పరిచర్య చేసిఉంటే నిన్ను తమలపాకులాగ చూచుకొని క్రింద నడవనీయకపోయేది. కాని ఇక్కడ ప్రాణాలర్పించినాసరే ఒకళ్ళనోటా మంచిమాట రాదు.'

నాకు నా తప్పు పూర్తిగా అర్థమయింది. ఆయన కోపం శాంతింపజేయాలనే ఉద్దేశంతో అన్నాను – 'అర్ధరాత్రిదాకా లైటుంచి కూర్చోవటం తప్పైనాది. మీ అమ్మగారు ఆర్పి వేయమంటే తప్పేముంది ? నాకు తెలియజెప్పటం, మంచి బోధించటం వారిధర్మం. చేతనైనమట్టుకు వారికి పరిచర్య చేయటం, వారు నేర్పిన ప్రకారం నడుచుకోవటం నా ధర్మం.

ఆనంద్ ఒకక్షణం సేపుగుమ్మంకేసి చూస్తూ వెంటనే అన్నారు—ఇంకీ కొంపలో నాకు సాగదు. తెలిసిపోతోంది. నీవు చెప్పకపోయినా నేనంతా వింటూనేఉన్నాను. అంతా అర్థమవుతోంది. నా పాపాలకి ప్రాయశ్చిత్తం నీవు చేయవలసి వస్తోంది. 'మీ ప్రవర్తన ఇల్లాగే ఉండేటట్టయితే మీ యిల్లు మీరు చక్కబెట్టుకోండి. నా దారి నేను చూచుకొంటా'నని రేపు మా అమ్మతో తెగేసి చెప్పేస్తాను.

నేను చేతులు జోడించి గడగడలాడుతూ అన్నాను — వద్దు వద్దు. అల్లాంటిపని చేయకండి. 'అయ్యో! నా తెలివి మండా!' ఒట్టి మాటెందుకు చెప్పానురా దేవుడా! మీ పాదాలు పట్టుకుని చెప్తున్నాను. నిజంగా నా కత్తగారంటే ద్వేషం లేనేలేదు. వదినెఅన్నా నాకేమీ కష్టంలేదు. నా కిద్దరూ నాకంటె పెద్దవాళ్ళు. నాకు తల్లివంటివాళ్ళు. ఏదైనా ఒక కఠినమైనమాట అన్నా నేను సహించుకోవాలి. మీరు వాళ్ళనేమీ అనకండి. అంటే నాకు చాలాదుఃఖం కలుగుతుంది.'

ఆనంద్ డగ్గుత్తికతో అన్నాడు. 'నీ వంటి కోడలు దొరికినా ఆవిడహృదయం యేమీకరిగటంలేదు. ఇంకా ఎవరైనా స్వర్గాన్నుంచి దేవత దిగివస్తుందా? నువ్వేమీ భయపడకు. నేనేం పెద్ద పోట్లాటపెట్టుకోనులే. కాని ఒళ్ళు దగ్గరపెట్టుకుని మసలుకోమని మాత్రం చెప్పితీరతాను. ఈ వేళ నేనే కనక ఏ రెండువందలో మూడువందలో తెస్తూవుంటే ఒక్కళ్ళూ మాట్లాడేవాళ్ళుకాదు. ఏమీ సంపాదించనివాడి కిది శిక్ష. నిజం చెప్పాలంటే నాకు పెళ్ళిచేసికోనెందు కేమీ అధికారం లేదు. నాలాంటి సంపాదనలేని మందబుద్ధికి తనతోపాటు ఒక ఆడదాన్నికూడా బాధపెట్టటాని కేమి హక్కుంది? అక్కయ్య కేం వచ్చిందో నీ వెనకాలపడిందే. అత్తవారిల్లు నాశనం చేసింది. ఇంకిక్కడకూడా నిప్పుపెట్టటానికి సిద్ధమైంది. నాన్న గారిముఖం చూస్తున్నానుగాని లేకపోతే, ఒకరోజులో వీళ్ళ సంగతి కనుక్కొనేవాణ్ణి!'

అక్కా! అప్పటికెల్లాగో ఆయన్ని శాంతపరచాను. కాని మళ్ళీ అదెప్పుడు పొంగుతుందో చెప్పలేను. నాకోసం లోకమంతటితోటీ అయినాసరే ఆయన పోట్లాడవలసివస్తే సిద్ధమే. నేనేపరిస్థితిలో ఉన్నానో నీ వూహించగలవు. నామీద ఎన్ని దెబ్బలు పడినా నేనేడవకూడదు. నాలిక మెదపకూడదు. నేనేడిశానా, కొంప ధ్వంసమయిందన్న మాటే. ఆనంద్ ఇంకేమీ వినిపించుకోరు. ఏమీచూడరు. బహుశః ఈ ఉపాయంతో (ఆయన దృష్టిలో) నా హృదయంలో ఆయనమీద ప్రేమ అంకురింపజేసుకోవాలని చూస్తున్నారేమో! ఈయనెంతకోపదారివారో నాకీవేళ తెలిసింది. నేనేమాత్రం ఊతమిచ్చినా రాత్రే అత్తగారిమీదవెళ్ళి పడేవారే. ఎంతమంది యువతులీ అధికారగర్వంతో తమ ధర్మం మరచిపోతున్నారు కాదు! నేనుమాత్రం అక్కా, భగవంతుడి దయవల్ల ఎన్నటికీ మరచిపోను. 'ఆనంద్ వేరుపడితే ఎల్లాగడుస్తుంది' అనేభయం నాకులేదు. నేనాయనతోపాటు సర్వం అనుభవించగలను. కాని కొంప అల్లరిపడిపోతుంది. చాలు, ప్రియ పద్మా, నేటికింతే, ఉత్తరానికి జవాబు వెంటనే వ్రాయి.

నీ సీత



# 11

ఢిల్లీ, 5-2-26.

ప్రియ సీతా !

ఏమి వ్రాయను ? నా కీ ఆపత్తు కొండవిరిగి మీదపడినట్లు వచ్చిపడింది. ఆయన వెళ్ళిపోయారు. నన్ను విడచిపెట్టి ఏమీ చెప్పకుండా లేచిపోయారు. ఇంతవరకూ ఏడవలేదు. ఆయన కోసం వచ్చినవాళ్ళతో, 'రెండు మూడు రోజులలో వస్తారు. పనిమీద కాశీ వెళ్ళారు'- అని ఏదో కప్పిపుచ్చి చెపుతున్నాను. కాని ఏడ్చానంటే ఈ శరీరం ఆ కన్నీళ్ళలో మునిగిపోతుంది. అందులోనే నా ప్రాణాలు పోతాయి. వంచకుడు నాకేమీ చెప్పాడు కాదు. రోజూలాగే లేచారు. విద్యాలయానికి వెళ్లారు. మామూలుగా ముసి నవ్వుతూ నా దగ్గరికి వచ్చారు. మే మిద్దరం టిఫిన్ తీసుకొన్నాం. తర్వాత ఆయన దినపత్రిక చదవటం మొదలుపెట్టారు. నేను టెన్నిస్ ఆడుకోటానికి వెళ్ళిపోయాను. ఈమధ్య కొద్దిరోజులనుంచి ఆయనకి టెన్నిసంటే ఎందుకో ఇష్టం తగ్గింది. నే నొక్కతెనే వెడుతున్నాను. తిరిగి వచ్చేసరికి వసారాలో పచార్లు చేస్తూ సిగరెట్టు కాలుస్తున్నారు. నన్ను చూడగానే ప్రతిరోజూలాగే నా ఓవర్ కోటు తెచ్చారు. నా మీదవేశారు. వసారాలోంచిఆ ఖాళీస్థలంలోకి షికారుగా వెళ్ళాం. కాని అక్కడెక్కడవగా మాట్లాడలేదు. ఏదో ఆలోచనలో పడి ఉన్నారు. మంచు బాగాపడటం మొదలుపెట్టేసరికి మేము మళ్ళీ యింటిలోకే వచ్చేశాం. అప్పుడే నాకు వీణనేర్పే బంగాళీ

మహిళ వచ్చింది. వినోద్ కూడా నాతోటే కూర్చున్నారు. ఆయనకి సంగీత మెంతయిష్టమో నీకు వ్రాసేఉన్నాను. విశేష మేమీ లేదు. ఆ మహిళ వెళ్ళిపోయినతర్వాత మేము కలిసే భోజనం చేశాము. నేను నా గదిలోకి పడుకోటానికి వచ్చాను. ఆయన రోజూలాగే తమగదిలోకి చదువుకోటానికి వెళ్ళిపోయారు. నేను వెంటనే నిద్రపోయాను; కాని ఆయన నా గదిలోకి వచ్చేసరికి కళ్ళు తెరచాను. నేను నిద్రలో ఎంత ఒళ్ళు తెలియకుండాపడిఉన్నా, ఆయనఅలికిడి అయితే నాకు మెలకువ వచ్చేస్తుంది. చూచాను. ఆయన తన పచ్చశాలువ కప్పుకొని నుంచున్నారు. నేను చేతులుజాపి అన్నాను – 'రండి, నుంచున్నారేం'? అని మళ్ళీ నిద్రపోయాను. అంతేచెల్లీ! అదే వినోద్ అంతిమ దర్శనం. ఆయన మంచంమీద పడుకొన్నారో లేదో తెలియదు. ఈ కళ్ళకదేమిటో మహానిద్ర పట్టుకువచ్చింది. తెల్లవారిచూస్తే వినోద్ లేరు. నేనాయనకంటె ముందు లేస్తూ ఉంటాను. ఆయన ఇంకా పడుకొని నిద్రపోతూఉంటారు. కాని ఈ వేళ ఆయన ప్రక్కమీద లేరు. వారి శాలువాకూడా లేదు. తన గదిలోకి వెళ్ళివుంటారేమో అనుకొన్నాను. స్నానాల గదిలోకి వెళ్ళాను. ఒక అరగంటలో తిరిగివచ్చాను. అప్పుడు కూడా ఆయన కనిపించలేదు. ఆయన గదిలోకి వెళ్ళాను. అక్కడకూడా లేరు. ఆశ్చర్యంవేసింది. ఇంతప్రొద్దున్నే ఎక్కడికి వెళ్ళారో! వంకెని బట్టలులేవు. ఎవరినైనా కలవటానికి వెళ్ళారా? స్నానం కాకుండానే షికారులు బయలుదేరారా! కొంచెం చెప్పకూడదూ! సంశయం కలుగుతూఉంది. కోపం వచ్చింది. నేను దాసీదా న్ననుకొంటున్నారు... ...

షైమయింది. 'బై రా'బల్లమీద 'టీ' పెట్టి వెళ్ళాడు. వినోద్ కోసం చూచిచూచి టీ చల్లారిపోయింది. నా కూరికే కంగారుగా వుంది. లోపలికి వెళ్ళనూ, ఇవతలకి రానూను. ఈవేళ రాగానే జ్ఞాపకముండేలాగ పెడదామనుకొన్నాను. 'మీ ఇల్లు మీరు చక్క పెట్టుకోండి. మీ ఇంట్లో మీరు ఇక సుఖంగా ఉండండి, నేను మా యింటికిపోతాను. నాకు ఈ మాత్రంతిండి అక్కడా దొరుకుతుంది'అని. శీతకాలంలో తొమ్మిదవటం ఎంతసేపు? ఇంకా వినోద్ జాడ లేదు. ఒళ్ళుమండి ఆయనగదిలోకి వెళ్ళాను, 'ఇల్లాగే ఉండవలసివస్తే మీరుండండి; నేనుండలేను'అని ఒక ఉత్తరం వ్రాసి బల్లమీద పడేద్దామని. 'నేనెంత ఓపిక పడుతున్నానో మీ రంత రెచ్చగొడుతున్నా'రనీని. చెల్లీ! ఆ కోపంలో సంతప్త భావాలు నదిలాగే హృదయంలో ప్రవహిం చేస్తున్నాయనుకో వ్రాయటానికే కూర్చుంటే పేజీలకి పేజీలు వ్రాసిపడేసేదాన్ని. కాని అయ్యో! నేను లేచిపోతానని బెదిరించానుగాని ఆయ నంతకుముందే లేచిపోయారు. బల్లమీద కూర్చునేసరికి నా కాయన 'ప్యాడ్'లో ఆయనఉత్తరం కనిపించింది. నేను వెంటనే ఉత్తరం తీశాను. గబగబా చదివాను. నా చేతులికి వణుకుపుట్టుకుంది. కాళ్ళు దడదడలాడాయి. గది కదిలిపోతోం దనిపించింది. ఒక హృదయవిదారకమైన దీర్ఘ విశ్వాసం విడిచి సోఫామీద పడ్డాను. ఉత్తరమిది.

'ప్రియా! మొట్టమొదటిసారిగా నీ దర్శనభాగ్యం కలిగి తొమ్మిదినెలలైంది. అప్పుడు నేను ధన్యుణ్ణనుకొన్నాను— నేను నీతో వియోగంపొందే దౌర్భాగ్యం పట్టింది. అయినా నేను ధన్యుణ్ణనే అనుకొంటున్నాను. నాకు వెళ్ళిపోతున్నానని

లేశమైనా దుఃఖంలేదు. ఎందుచేతనంటే-నీవు సుఖపడతావని నే నెరుగుదును. నీవు నాతో సుఖంగా ఉండలేకపోయినప్పుడు నేను బలవంతంగా ఎందుకు పడివుండాలి? ఇంతకంటె మనం వేరువేరుగా ఉండటం మంచిది. నే నిప్పు డెల్లాఉన్నానో అల్లాగే వుంటాను. నీవుకూడా ఈ రీతిగానే ఉంటావు. అయినప్పుడు సుఖజీవనం కలుగుతుందనెల్లా అనుకొంటాం? నేను వివాహం ఆత్మవికాసానికి సాధనమనుకొంటున్నాను. స్త్రీ పురుష సంబంధాని కేదైన అర్థమంటూ వుంటే అది ఇదే. కాకపోతే పెళ్ళి అవసరమని నాకు తోచదు. మానవసంతానం పెళ్ళి లేకపోయినా బ్రతికేవుంటుంది. బహుశః ఇంతకంటె బాగాకూడా. వాసనకూడా వివాహం అక్కరలేకుండానే తీరుతుంది. ఇల్లు చక్కబెట్టుకోవటానికి పెళ్ళిచేసికోవలసిన అవసరంలేదు - జీవిక ఒక అప్రధాన సమస్య. భగవంతుడు రెండు చేతులిచ్చివుండగా ఎవడూ తిండి తినలేకపోడు. అందుచేత ముఖ్యముగా వివాహోద్దేశం స్త్రీ పురుషులు పరస్పరం ఆత్మోన్నతికి తోడ్పడతారనేదే. అనురాగం ఉన్నచోటే వివాహం. ఆ అనురాగమే ఆత్మోన్నతికి ముఖ్యసాధనం. అనురాగం లేదా,- వివాహం లేదు. అనురాగం లేనిదే వివాహానికేమీ అర్థమేలేదు.

నిన్ను నేను మొట్టమొదటిసారి చూచినప్పుడు నీవు నాకు అనురాగానికి సజీవమూర్తిలాగ కనిపించావు. నీలో సౌందర్యం ఉంది; విద్యఉంది; ప్రేమఉంది, స్ఫూర్తిఉంది; ఉత్సాహంఉంది. ముగ్ధుణ్ణయ్యాను. ఆనాడు నా గ్రుడ్డికళ్ళకి ఇన్నిగుణాలున్న నీలో వీటిసన్నింటినీ కప్పివేయగల చంచలత్వముకూడా ఉందని అర్థమయిందికాదు. నీవు చంచలమైన దానవు. విలక్షణమైన

చాంచల్యము. అది నాకప్పుడు తోచలేదు. ఎక్కువ లేదు. తక్కువ లేదు. నేను నిన్ను స్వతంత్రురాలిని చేయాలనుకొన్నాను. ఎందుచేతనంటే నా దృష్టిలో సంపూర్ణాన్నత్వాన్ని పొందాలంటే అన్నిటికంటె ఇదే బాగా అవసరం. లోకంలో ఎక్కడ చూచినా పురుషులకు వ్యతిరేకంగా ఇంతగోల బయలుదేరిందంటే ఎందుకు? ఇందుకే మేము స్త్రీల స్వాతంత్ర్యం లాగేసుకొన్నామనీ, వాళ్ళని మా కోరికలకోసం దాసీలగా ఉంచుకొన్నామనీ, నేను నిన్ను స్వతంత్రురాలిని చేశాను. నీమీద నాకేమీ అధికారం లేదని అంగీకరిస్తున్నాను. నీ మట్టుకు నీవు స్వతంత్రురాలవు. నీవు నా దగ్గర స్వేచ్ఛగా వుంటున్నావని నేననుకొన్నంతవరకు నాకేచింతా లేదు. నీవు స్వేచ్ఛగా గాక సంకోచంగాను,- భయంగాను బంధనంవల్ల నా దగ్గర ఉంటున్నావని నాకిప్పు డర్థమవుతోంది. రెండుమూడు రోజుల క్రితమే నాకిది వ్యక్తమయింది. అందుచేతనే యింక నేను నీ సుఖమార్గానికి బాధ కలిగించ దలచుకోలేదు. నే నెక్కడికీ పారిపోవటంలేదు. కేవలం నీ మార్గాన్నుంచి తొలగి అదేనా నావల్ల నీకు పూర్తిగా నిశ్చింత కలిగేటంత దూరం తొలగిపోతున్నా నంతే. నేను లేకపోతే నీ జీవిత మెక్కువసుందరమైనది కాగలిగినప్పుడు నేను బలవంతంగా నిన్నట్టేపెట్టను. నా సుఖమార్గానికి నీవడ్డు తగులుతున్నావని తోస్తే నీతో స్పష్టంగా చెప్పిఉండేవాణ్ణి. నేను ధర్మము, నీతి అనే మోసానొప్పుకోను. కేవలం ఆత్మసంతోషమే కావాలి. నీకైనా, నాకైనా అంతే. జీవనతత్వాం ఇదే. మూల్యాం ఇదే. నేను డస్కులో మా 'డిపార్ట్మెంటు-హెడ్'కి ఒక ఉత్తరం వ్రాసి

పెట్టాను. అది ఆయనదగ్గఱకి పంపేసెయ్యి. డబ్బునుగురించి ఏమీ బాధ పడవద్దు. నా ఎకౌంటులో ఇంకా నీకు కొన్ని నెలలవఱకూ సరిపోయే డబ్బుంది. తరువాతకూడా నీకు కావలసినంత కాలం లభిస్తూనేఉంటుంది. నేను నా భావం స్పష్టం చేశాననుకొంటాను. ఇంతకంటె ఎక్కువగా చెప్పదలచుకో లేదు. నన్ను కలవాలనిపించినప్పుడు బ్యాంక్‌లో నా ఎడ్రసు తీసుకో. కాని, రెండు మూడు రోజులతర్వాత. కంగారు పడవలసిన అవసరమేమీ లేదు. నేను స్త్రీని అబల అని పంగువని అనుకోను. తలచుకొంటే ఆమె తనరక్షణ తాను చేసికోగలదు. ఇప్పుడుగాని, ఇంకా రెండు మూడు నెలలకుగాని, రెండు మూడేళ్ళకిగాని నేను జ్ఞాపకం వస్తే, నాతో సుఖపడగలవని నీకు తోస్తే, నీవు కేవలం రెండుముక్కలు వ్రాసిపారేయి. నేను వెంటనే వస్తాను. ఎందుచేతనంటే - నీవంటే నాకేమీ కోపం లేదు. నీతో నా జీవితంలో గడచిన రోజులు నాకు స్వర్గ—స్వప్న దివసాలే. నేను బ్రతికి వున్నంతకాలం ఈ జీవితానంద స్మృతులు నా హృదయంలో ఉంచుకొంటాను. హా! ఇంతసేపు మనస్సుని పట్టి ఉంచినమీదట నా కళ్ళలోంచి ఒక బిందువు (కన్నీరు) పడనే పడింది. క్షమించు. నేను నిన్ను చపలనన్నాను. ఆ చపలు లెవరు? నన్ను నీ హృదయంలోనుంచి తీసి విసరి పారేశావని తెలుసు. అయినా ఈ ఒక్క గంటలోనూ ఎన్నో సార్లు నిన్ను చూచిచూచితిరిగి వచ్చాను. కాని ఈ మాటలు వ్రాసి నీదయకు పాత్రుణ్ణి కావాలనుకోవటంలేదు. నా నీతిలో నీకు దేని కధికారముందో, ఇంకా ఉంటుందో అదే చేశావు. నేను వివాహంలో ఆత్మను సర్వోన్నతంగా ఉంచదలచాను.

స్త్రీ పురుషులలో నేనా ప్రేమ ఉండాలంటాను. ఇద్దఱు స్వతంత్ర వ్యక్తులమధ్య పరాధీనత నాధారం చేసుకొనిఉన్నది ప్రేమ కాదు.

చాలు. ఇంకేమీ వ్రాయను. నీకొక సూచన చేయాలని ఉంది; కాని చెయ్యను. ఎందుకంటే నీ మంచిచెడ్డలు నీకు తెలుసు. నీవు నీకు సలహాయిచ్చే హక్కును నామీదనుంచి లాగేసుకొన్నావు. ఐనా ఇంతమాత్రం చెప్పకుండా ఉండలేక పోతున్నాను. ప్రపంచంలో ప్రేమ అనే మాయపన్నే దుష్టు లకు లోటులేదు. వాళ్ళ మాయల్లోంచి తప్పించుకొంటూ ఉండు. నీ వెక్కడున్నాసరే ఆనందంగా ఉండాలని దైవాన్ని ప్రార్థిస్తున్నాను. నీకు నా అవసరంవస్తే జ్ఞాపకంచేసుకో. నీ ఫొటో ఒకటి అపహరించుకు పోతున్నాను. క్షమించు. ఏం? నాకీమాత్రంకూడా అధికారంలేదూ? ఆఁ! ఒకసారి మళ్ళీ చూచివద్దామనిపిస్తోంది. కాని రాను.

నీవు తన్నేసిన వినోద్.

చెల్లీ! ఈ ఉత్తరం చదివాక నా మనస్సెలా ఉంటుందో నీ వూహించగలవు. నేనుఏడవలేదు. కాని గుండె ఆగిపోయింది. విషంతాగి పడుకొందామనిపిస్తూ ఉంటుంది. పది గంటలవటాని కింకెంతో లేదు. నేను వెంటనే విద్యాలయానికివెళ్ళాను. సైన్సు డిపార్టుమెంట్ హెడ్ కి వినోద్ లెటరిచ్చాను. ఆయనొక మద్రాసీ పెద్దమనిషి. నన్నుచాలా గౌరవించి కూర్చోపెట్టాడు. ఉత్తరంచదివి ఆయనెక్కడికి వెళ్ళారో, ఎప్పుడువస్తారో మీకే మన్నా తెలుసునా? అన్నాడు.

దీనిలో ఒక నెల సెలవిమ్మని ఉంది. ఆయనొక అవసరమైన పనిమీద వెళ్ళారని నే నబదమూడాను. నిరాశతో యింటికి వచ్చాను. నా అంతరాత్మ వేలకొలది జిహ్వలై నన్ను నింది స్తోంది. గదిలో ఆయనఫోటోముందు మోకరించి ఎటువంటి పశ్చాత్తాపపూర్ణ శబ్దాలతో క్షమాపణ కోరాను! ఆ దే విధంగానైనా ఆయన చెవులోదాకా చేరగలిగితే నా విష యంలో తానెంత భ్రమపడిందీ ఆయనకు తెలిసేది. అప్పటి నుంచీ యిప్పటిదాకా ఏమీ తినలేదు. నిద్రపోలేదు. వినోద్ నా ఆకలి, నిద్రకూడా తనతో తీసుకొనిపోయారు. ఇల్లాగే అయిదురోజులో, పదిరోజులో ఆయనవార్త తెలియకుండా ఉంటే నా ప్రాణాలుకూడా పోతాయి. ఈవేళ నేను బ్యాంక్ కి వెళ్ళానుకాని వినోద్ దగ్గరనుంచేదైనా ఉత్తరం వచ్చిందా! అని అడిగేధైర్యం లేకపోయింది. వాళ్ళేమనుకుంటారు? ఈమె ఆయనభార్యయై యుండి మనల నడగటానికి వచ్చిందేమిటను కోరూ ?

చెల్లీ! వినోద్ రాకపోతే ఎల్లాగ? ఆయన నేనంటే ఎంతో ఔదాసీన్యం వహించారు. నన్ను లెక్కచేయటంలేదు. నాతో తన హృదయంవిప్పి మాటాడరు. బహుశః ఆయనకు నేను భారమయ్యానేమోనని నే ననుకొనేదాన్ని. నేనెంత భయం కర భ్రమలోపడ్డానో ఇప్పుడు తెలిసింది. ఆయనహృదయం ఇంత కోమలమైనదని తెలిస్తే ఆనాడా భువనతో ఎందుకు మాట్లాడతాను? నేనా దౌర్భాగ్యుడి ముఖమైనా చూచే దాన్నికాను. ఇప్పుడుకనక అతడు కనిపిస్తే వేలుస్తానేమో కూడా. కాస్త నీవు వినోద్ ఉత్తరం మళ్ళా చదివిచూడు.

వారు నన్ను స్వతంత్రురాలిని చేయాలనుకుని వెళ్ళిపోయారట. స్వతంత్రురాలినే చేస్తూఉంటే భువన్‌తో కాస్సేపు మాట్లాడి నందు కింత కష్టమెందుకూ? నా కాయన అచంచలశాంతి చూస్తేనే ఒళ్లుమండుతోంది. నిజానికి కాస్త విషయం ఆయన మనస్సు కింతఅశాంతి కలిగించిందా! నా కయితే అల్లా కల గదు. నేను ఏ రమణిమీదనైనా ఆయన కిష్టమున్నట్లు చూస్తే మూతి ముడుచుకొంటాను; సాధిస్తాను; నేను ఏడుస్తాను. ఆయ న్నేడిపిస్తాను. ఇంతపనిచేస్తానేమోగాని, ఇంతతొందరగామాత్రం పారిపోను.

పురుషులు ఇల్లువదిలిపెట్టి పారిపోవటం నేను ఇంతవఅకూ వినలేదు. ఆడవాళ్లే ఇల్లువదిలిపెట్టి పుట్టింటికి పోతారు. లేక పోతే ఎందులోనోదిగో, ఎలాగో ఆత్మహత్య చేసుకొంటారు. పురుషులు నిర్భయంగా మీసాలు మెలివేసుకు కూర్చుంటారు. కాని యిక్కడ గంగ ఎదుటికి ప్రవహిస్తూఉంది. పురుషుడే పారిపోతే ఈ అశాంతిని తగ్గించేవా రెవరు? ఈ ప్రేమలోతు లెవరు తెలుసుకోగలరు. నే నిప్పుడుకనక వినోద్ చరణాలమీద పడి మరణిస్తే నాకు స్వర్గం లభించినట్లు భావిస్తాను; అంతే. అంతకంటె నా కిప్పుడేమీ కోరిక లేదు. ఈ అగాధమైన ప్రేమ నన్ను తృప్తిపరచింది. వినోద్ నా దగ్గఱనుంచి పారిపోయాడు గాని, అసలు పారిపోలేకపోయాడు, ఆయన నా హృదయానికి, నా ధారణకి ఇంతదగ్గఱగా ఎప్పుడూ లేరు. నే నిప్పుడుకూడా ఆయన నాదగ్గఱ కూర్చున్నట్లేచూస్తున్నాను. 'నా దగ్గర మీరు 'ఫిలాసఫర్' కావటానికి సిద్ధమయ్యారయ్యా! తమరి దార్శనిక గంభీరత ఎక్కడికిపోయిందో? అనవసరంగా మిమ్మల్ని మోస

గించుకొంటున్నారు. ఇల్లా మీ ఆత్మను ఎందుకు బాధపెట్టు కుంటున్నారు. ఇప్పుడంటే పారిపోయారు. ఈ పట్టు పారిపొండి; చూస్తాను. మీరింత చతురులనీ, ఇన్ని వేషాలు వేస్తారనీ తెలి యదు: ఇప్పుడు తెలిసింది. బహుశః ఇది మీ దార్శనికగాంభీ ర్యానికికూడా తెలిసిఉంటుంది' అనేదాన్ని.

నిజంగా గాఢమయిన ప్రేమ ఎంత సత్యమైనటువంటిదో, ఎంత ఆర్ద్రమైఉంటుందో, ఎంత కోమలమైనదో! అది ఆప త్సమయంలో మునకలు వేయుగలదుగాని అవమానపు దెబ్బ ఒకటైనా సహించలేదు. ఛీ! చిత్రం. నిజంగా ఇప్పుడు నా హృదయంలో పొందే ఉత్సాహానందాల అనుభవము వినోద్ హృదయంతో అంటుకొని ఉన్నప్పుడుకూడా నేను పొందినట్లు జ్ఞాపకం లేదు. అప్పుడు తెర అడ్డముంది. ఇప్పుడే తెరా మధ్యగాలేదు. నేనాయన్ని ప్రచలితమైన ప్రేమవ్యవహారపు గీటురాయిమీదే గీసి చూడదలచాను. పురుషు డింటికివచ్చే టప్పు డేదో ఒకటి ఆడదానికి తేవటం 'ఫ్యాష' నయిపోయింది. అతడు రాత్రింబవళ్ళు ఆడదానికి నగలు చేయించటం, బట్టలు కుట్టించటం, లేసుకొనటం అనేపనుల్లోనే బాగా నిమగ్నమై యుండాలి. అప్పుడాడది అతన్నే మీ అనదు. అత డాదర్శపతి. అతని ప్రేమలో ఎవరికికేమి సందేహం ఉంటుంది? కాని ఆ ప్రేయసి చచ్చినతరువాత మూడు నెలలలోనే తిరిగి అతడు క్రొత్తగా పెళ్ళిచేసుకొంటాడు. స్త్రీయందు తనకున్న ప్రేమ కూడా చితిలో తగలబెట్టివస్తాడు. మళ్లా ఆ నాటకమే కొత్త భార్యతో ప్రారంభం.

నేనీ ప్రేమనే అంతటా చూస్తున్నాను. ఈ గీటురాయి మీదే గీచి వినోద్‌నుకూడా పరీక్షిస్తున్నాను. ఎంత తెలివి తక్కువ! నేను వెకిలితనాన్ని ప్రేమఅనుకొని కూర్చున్నాను. ఇల్లాగే నగలు, బట్టలు, నవ్వులు, కబుర్లలోనే మగ్నమైన లంపటులు చాలమంది ఉన్నారని ఎంతమంది స్త్రీలకి తెలుస్తుంది? తమలంపటత్వం దాచుకోటానికి వాళ్ళు నాటక మాడతారు. కుక్క మొరగకుండా ఉండటానికి దానిముందు ఇంత తెలకపిండి పడేస్తారు. పాపం, అమాయకురాలైన ఆడది తన సర్వస్వమూ అర్పించి కటబొమ్మలు పొందుతుంది. వాటిలోనే మగ్నమై యుంటుంది. వినోద్‌ని నే నా కాటామీదే తూచేదాన్ని. వజ్రాన్ని తక్కెడలో ఉంచేదాన్ని. నాకది తెలుసు. నాకు విశ్వాసంకూడా వుంది. ఆయన సిరచిత్తులు. వినోద్ దృష్టి పరస్త్రీలమీదికి ప్రసరించదు. ఆయనకి మంచిదాన్నయినా చెడ్డదాన్నైనా నేనొక్కర్తనే. చెల్లీ! గర్వానందాలతో హృదయం ఎంతో పొంగింది! ఇంత అచంచల స్వరక్షిత సామ్రాజ్యాన్ని ఏ స్త్రీకైనా పొందే అదృష్టముందా? నాకు మాత్ర మనుమానమే. ఇంకా నాకసంతృప్తే. పైన బుడగలున్నా ముత్యాలు సముద్రంఅడుగునే దొరుకుతాయనేది నే నెరగను.

అయ్యో! నా మూర్ఖత్వంవల్ల నా వినోద్ ఎంత మానసిక వ్యధపడుతున్నారు? నా జీవనం, నా జీవనసర్వస్వం ఎక్కడెక్కడ తిరుగుతున్నారో! ఏ దేశంలో ఉంటున్నారో! నామీదెల్లాంటి అనుమానాలు కలుగుతున్నాయో? 'ప్రియా! నీవు నాకేమీ అన్యాయం చేయలేదు. నేను నిన్ను నిష్ఠూరుడవనుకొంటే, నీవు నన్నంతకంటె పనికిమాలినదానిగా భావించావు.

ఇంకా కడుపునిండ లేదూ! నీవు నన్నింత పనికిమాలినదా న్ననుకొన్నావంటే ఆ అభాగ్యుడు భువన్ ... నేనిల్లాంటి ఒకలక్ష భువన్‌లని నీ చరణాలకి కానుక ఈయగలను. నా దృష్టి పడగలిగిన వ్యక్తి నాకీ లోకంలో కనిపించడంలేదు. కాదు, నీవు నన్నింత నీచురాలినసీ, కళంకినసీ భావించలేవు. బహుశః ఆ సంఘటనే వస్తే మనిద్దరిలో ఏ ఒక్కరమూ కూడా ఈ లోకములో వుండలేము.

చెల్లీ! నేను వినోద్‌ను పిలిచేందుకు, లాక్కొచ్చేందుకు, పట్టి తెప్పించేందుకు ఒక ఉపాయ మాలోచించాను. ఏమని చెప్పను ? నిన్ననే యీ ఆలోచన నాకెందుకు తట్టకూడదు ? వినోద్‌కి దినపత్రిక చదవందే ఏమీ తోచదు. అదేనా, ఆయన ఏ పేపరు చదువుతాడో నాకు తెలుసు. రేపటిపేపర్లో పద్మ చనిపోతోందని పడుతోంది. ఎల్లుండి వినోద్ ఇక్కడ వుంటారు. ఇక ఆగలేరు. మా కింకా బాగాపోట్లాట, తగవు జరుగుతాయి.

ఇంక కాస్త నీ విషయంవ్రాస్తా. నిజంగా మీ ముసలిది నీవు చదువుకొన్నదానవనీ, అందక త్తెవనీ నీమీద కోప్పడుతోందా? బలే! మీ ఆనంద్ కూడా విచిత్రమైన జీవంలాగే కనబడుతున్నాడు. పురుషుడెంత కురూపియైనా అతనిదృష్టి ఎప్పుడూ అప్సరసలమీదే పడుతుందని విన్నాను. మరి ఆనంద్ బాబు నీ దగ్గరెందుకు సందేహిస్తాడు ? రాధాకృష్ణులమధ్య ఎక్కడా కుబ్జ లేదుగదా! కాస్త జాగ్రతగా కనిపెట్టు. అత్తగారిల్లా అవస్థ పెడుతూవుంటే, నన్నడిగితే వేరుపడటం మంచిదంటాను. నీవు నా సలహా పాటించవనీ, ఎల్లాగూ ఒప్పుకోవనీ తెలుసు. ఈ

సహనానికి మాత్రం నీకు ధన్యవాదాలు—ఉత్తరం వెంటనే వ్రాయి. కాని నీ ప్రత్యుత్తరం రాకముందే నా రెండవ ఉత్తరం నీకందవచ్చు.

నీ పద్మ



# 12

కాశీ, 19-2-26.

ప్రియ పద్మా!

**కొ**ద్దిరోజులు నీ ఉత్తరంకోసం ఎదురుచూచినమీదట నేడీ ఉత్తరం వ్రాస్తున్నాను. వినోద్ బాబు ఈపాటికి ఇంటికివచ్చే ఉంటారని ఆశిస్తున్నాను. కాని యింకా ఆయనరాక, నీవు కళ్ళు కాయలుకాచేలాగ ఎదురుచూస్తూ కూర్చున్నా, నాకెంతమాత్రం దుఃఖంకలగదు. నీ వాయనకు చేసిన అన్యాయానికిదే శిక్ష. నీమీద నాకేమీ సానుభూతి లేదు. నీవు గృహిణివై యుండి కుటిలక్రీడ లాడటానికి తయారయ్యావు. అది ప్రేమవ్యాపారం చేసే ఆడవాళ్ళకే శోభిస్తుంది. వినోద్ నీ పీక నొక్కి, భువన్‌కు సంస్కారాలని శాశ్వతంగా శాంతిపరిస్తే, నేను సంతోషించిఉండేదాన్ని. నీకు నామీద కోపం వచ్చినాసరే గాని, నే నీమాట తప్పకుండా అంటాను.

నీవు వినోద్‌కి తగినదానవు కావు. కొత్త కొత్త ప్రేమనాటకాలతో నిన్నేడిపించే మగవాడంటేనే బహుశః నీవు తృప్తిపడతావు. స్త్రీలు కపటరసికులంటేనే ప్రాణమిస్తారని నీ ఇంగ్లీషు పుస్తకాలలో చదివి ఉంటావు. చదివినమీదట బుద్ధి తిరిగి ఉంటుంది. నీ కష్టమూ నష్టమూ ఏదో హడావుడి కావాలి. అది లేకపోతే నీ జీవనం శుష్కమైపోతుంది. నీవు భారతీయ పతిపరాయణా రమణివి కావు. యూరపీయ ఆమోద ప్రియ యువతివి. నాకు నీమీద జాలి కలుగుతోంది. నీ వింతవరకు రూపమే ఆకర్షణకు మూలమనుకొన్నావు. రూపంలో ఆకర్షణ ఉంది. ఒప్పుకొంటాను. కాని ఆకర్షణకు మారు పేరు మోహం. అది సిరమైనది కాదు. కేవలం మాయ. ప్రేమకొక్కటే మూలమంత్రం ఉంది. అది సేవ. తుమ్మెదలాగ నీ చుట్టూ తిరిగే మనిషి నిన్ను ప్రేమిస్తున్నాడనుకోకు. అతనికి రూపాసక్తి అట్టే రోజులుండదు. ప్రేమాంకురం రూపంలో ఉంది; కాని దాన్ని పల్లవింపజేసి, పుష్పింపజేసేపని సేవదే.

వినోద్ ఎంతో అలిసిపోయి చెమటతో వీధిలోనుంచి వచ్చినప్పుడు నీ వెప్పుడైన విసిరేవుంటావనేనా నాకు నమ్మకం లేదు. బహుశః 'టేబిల్ ఫాన్' వేయాలనేనా నీకు తోచివుండదు. నిజం చెప్పు. నా అభిప్రాయం సరియైనదా, కాదా? నీ వెప్పుడేనా ఆయనికి కాళ్ళు పట్టావా? ఆయన తలకి నూనె రాశావేమో చెప్పుదూ! అది పరిచారకులపని అంటావు. 'లేడీస్' ఈ పనులు చేయరంటావు. నీ వా ఆనందానుభవమే పొందలేదు. నీవు వినోద్‌ని నీ అధీనం చేసుకోవాలనుకొంటున్నావు. కాని దానికి సాధనం చేయుటం లేదు. విలాసిని మనోరంజనం చేయగలదుగాని

చిరసంగినికాలేదు. పురుషుని కౌగిలించుకొనిఉన్నా, ఆమె అత్తనికి క్రోసులదూరంలోనే వుంటుంది. రూపమోహం మనుష్యస్వభావమని ఒప్పుకొంటాను. కాని రూపంవల్లమాత్రం హృదయదాహం తీరదు. ఆత్మతృప్తి కలగదు. సేవాభావంవున్న స్త్రీ రూపవిహీనఅయినా, ఆమెభర్త పరస్త్రీరూపజాలంలో చిక్కు-కోడు. చిక్కినా త్వరలోనే పారిపోయివస్తాడు. సేవను చవిచూచిన హృదయం బాహ్యవిలాసాలకు మురిసిపోదు.

నీవు నాకంటె రెండుమూడు నెలలు పెద్దదానవు. కాని నీకు నేనుపదేశం చేయటానికి సిద్ధపడ్డాను. క్షమించక్కా! ఇది ఉపదేశం కాదు. ఈ విషయాలు మీకూ, మాకూ అందరికీ తెలుసు. కాని అప్పుడప్పుడు మరచిపోతూఉంటా మంతే. నేనూరికే నీకు జ్ఞాపకంచేశాను. నిజంగా ఉపదేశంలో హృదయముండదు. కాని ఈ ఉపదేశం నీకువచ్చిన ఈ విపత్తువల్ల నాకు కలిగిన వ్యథే.

సరే, ఇంక నా అవస్థలు విను. ఈ నెలలో ఇక్కడ గొప్ప గొప్ప సంఘటనలు జరిగాయి. ఆనంద్ బాబుకీ, అమ్మగారికీ మధ్య మనస్పర్థలు బాగా బయలుదేరాయని మునుపే వ్రాశాను గదా! అవి లోపల్లోపల రగులుతున్నాయి. రోజు కొకటి రెండుసార్లు తల్లీ కొడుకు లేదేవో అనుకొంటున్నారు. ఒక రోజున మా చిన్నాడబడుచు మా గదిలోంచి ఒక పుస్తకం తీసుకెళ్ళింది. ఆవిడకి చదివేఅలవాటు ఉంది. గదిలో పుస్తకం కనిపించకపోయేసరికి ఆవిడ నడిగాను. ఆ మాత్రానికే ఆ ఇల్లాలికి ఎంతో కోపం వచ్చింది. 'నామీద దొంగతనంకడతావా!'

అని మొదలుపెట్టింది. తల్లి కూడా ఆవిడపక్షాన్నే వాదించవచ్చి నన్ను బాగా చీవాట్లు పెట్టింది. దైవికంగా ఆవిడ నన్ను తిడుతూ ఉండగానే ఆనంద్‌బాబు ఇంటికి వచ్చారు. ఆయన్ని చూడ గానే ఆవిడింకా అరవటం మొదలుపెట్టింది. 'కోడలి కెంత ధైర్యమో చూడు. నీవు దాన్ని నెత్తి నెక్కించుకొంటున్నావు. అంతకంటె ఇంకేమీ లేదు. పుస్తకం దానిబాబుదా? పిల్ల తెచ్చిందేమో! అదేమన్నా అపరాధమా! పనిగట్టి వెళ్ళి దానిమీద పడింది. చేతిలోని పుస్తకం లాక్కోవటానికి సిద్ధ మైంది.'

అక్కా! నిజమే. పుస్తకంకోసం నాకంత ఆరాటం పనికి రాదు. ఆవిడ చదివేశాక తనే తెచ్చియిస్తుంది. తేదే అనుకో. నే నా ఒక్క పుస్తకం చదవకపోతే మునిగిపోయేదేమిటి? కాని నా పొగరుచూడు? లాక్కొన్నాను పుస్తకం! ఇంచు కానంద్ బాబు కోప్పడితే నాకేమీ దుఃఖముండకపోను. దానికిబదు లాయనకూడా నాపక్షమే వహించి కళ్ళెర్రజేయడం మొదలు పెట్టారు – 'ఒకళ్ళవస్తువు అడగకుండా ఎందుకు తేవాలి? ఇది మామూలు మర్యాదగదా?' దాంతో ముసలావిడకు ఒళ్ళు మండిపోయింది. మధ్యమధ్య ఈయనా మాటలన్నారు. ఈ పుస్తకం ఎందుకడిగానా? అని నా గదిలో కూర్చొని నే నేడు స్తున్నాను. అమ్మగారన్నంతినలేదు. ఆనంద్‌బాబూ తినలేదు. నాకు విషం త్రాగుదా మనిపించింది. రాత్రి అత్తగారు పడు కొన్నప్పుడు మామూలుగానే కాళ్ళు పట్టడానికి వెళ్ళాను. నన్నుచూడగానే ఆవిడ కసరుకొంది. కాని నే నావిడ కాళ్ళు పట్టుకొనేఉన్నాను. కాళ్ళపై పడి నున్నానేమో, ఆవిడకాలితో

గెం టేసరికి మంచంమీాదనుంచి పడ్డాను. క్రింద బుట్టలున్నాయి. వాటిమీాద పడటంవల్ల నానడుముకీ, వీపుకీ దెబ్బలుతగిలాయి. నేననుకోకుండానే నా నోట అరుపువచ్చింది.

ఆనంద్ బాబు గదిలో ఉన్నారు. నా అరుపువిని పరుగెత్తుకు వచ్చారు. గుమ్మందగ్గర నుంచుని 'అమ్మా దాన్ని చంపేస్తున్నావా? తప్పనాది. దాన్ని ప్రాణం తీస్తున్నావెందుకూ?' అంటూ గదిలోకివచ్చి నన్ను చెయ్యిపట్టుకులాక్కుపోయ్యారు. చెయ్యివిడిపించుకొందామని చూచానుగాని వదల్లేదు. నిజానికి ఆ సమయంలో ఆయన కలుగజేసికోవటం నాకు బాగాలేదు. ఆయనరాకపోతే నే నేదో ఏడ్చి ఆ తల్లి నొప్పించేదాన్ని. నేను పడిపోయేసరి కావిడకోపం కొంచెం తగ్గింది. ఆనంద్ రావటం తప్పయింది. ఆవిడ గదిలోంచి ఇవతలికివచ్చి మొహం చెండు కుంటూ 'ఆ! మూాడు ఎక్కడేనా విరిగిందేమో! పట్టీ అదీ వేయి!' అంటూ ప్రారంభించింది. ఆనంద్ నడవలోఆగి అన్నారు. 'నువ్వెవరిని చంపినా నే నేమీా మాట్లాడరాదన్నమాట!'

'అవును. నేను భూతాన్ని; మనుష్యుల్ని చంపేసెయ్యటమే నా పని. నేను నిన్నింకను చంపలేదాఅనే ఆశ్చర్యంగాఉంది.'

'ఇప్పుడయితే మాత్రం పోయిందేముంది? దమ్మిడీ విషంతో పని జరుగుతుంది.'

'ఆడదాన్ని నీవు నెత్తి నెక్కించుకోనేటట్టయితే ఎక్కడికైనా తీసుకుపోయి యెక్కించుకో. ఈ కొంపలో అదేం కుదరదు.'

'నేనూ ఇదే ఆలోచిస్తున్నాను. నువ్వేం చెప్పనక్కర్లేదు.'

'నేనూ నాకు కొడుకుపుట్టలేదనే అనుకొంటాను లే.'

'నేనూ మా అమ్మ చచ్చిపోయిందనుకొంటాను.'

నేను ఆనంద్ చేయి పట్టుకొని దూరికే లాగుతున్నాను; అక్కడనుంచి తొలగిద్దామని. కాని ఆయన నా చేయి విదిలించేస్తున్నారు. చివరికి తల్లి తనగదిలోకి వెళ్ళిపోయాక ఆయన గదిలోకి వచ్చారు; తలకాయపట్టుకు కూర్చున్నారు.

నేనన్నాను—మీ రెందుకిలాగ చేశారు?

ఆనంద్ క్రిందకిచూస్తూ అన్నారు-'అమ్మ నోటికొచ్చేసింది.'

'మీరే తొందరపడ్డారు. పాపం ఆమె ఏమీ అనలేదు.'

'నేనేం తొందరపడ్డాను!'

'లేకపోతే ఏమిటి! నేను మీతో ఏమీ ఫిర్యాదు చేయలేదు.'

'నేనుతీసుకురాకపోతే అమ్మ నిన్ను సగంచంపి వదిలిపెట్టేది. నీ వామెకోపం ఎరగవు.'

'ఇది మీ భ్రమ. ఆమె నన్ను కొట్టలేదు. తనకాలు విడిపించుకొంటున్నారు. నేను పక్కమీద కూర్చొనిఉండటంచేత కాలు కదుపుకొనేసరికి తగిలి పడిపోయాను. అమ్మగారు నన్ను లేవదీయబోతూనేవున్నారు. మీరు వచ్చేశారు.'

'తల్లి పుట్టిల్లునిగురించి మేనమామముందర చెప్పకు. నేను అమ్మని బాగా ఎరుగుదును. రేపే ఇంకొక యిల్లు చూస్తాను.

నిశ్చయంచేసుకొన్నాను. ఎక్కడో ఒకచోట నౌకరీ దొరకనే దొరుకుతుంది. వీళ్ళు పెట్టే తిండిమీదే ఆధారపడిఉన్నానను కొంటున్నారు వీళ్ళు. అందుకే ఈ తామసం.' నేను తెలియ చెప్పినకొద్దీ ఆయన రెచ్చిపోతున్నారు. చివరకు విసుక్కొని అన్నాను – 'అయితే మీ రొక్కరూ వెళ్ళి ఇంకో ఇంటిలో ఉండండి. నేను మాత్రం రాను. నన్నిక్కడే పడిఉండనీయండి.'

ఆనంద్ నా వైపు కఠోరనేత్రాలతో చూచి అన్నారు— 'అయితే ఈ తాపులు తినడమే బాగుందా?'

'ఆ, నాకిదే బాగుంది.'

'అయితే నువ్వు తిను. నేను తినదలచుకోలేదు. పోనీ, నీ ఆశ చూసుకోవటమే లాభం. చూసుకపోతే బాధ ఉంటుంది.'

'వేరే ఉంటే లోకమేమనుకుంటుంది?'

మరేం ఫరవాలేదు. లోకం భ్రష్టం.'

'లోకులేమంటారు? ఆడదే ఈ మాయ పన్నిందంటారు.'

'అయినా ఫరవాలేదు. ఆ భయంతో జీవితం పాడుచేసుకొంటానా?' నేను ఏడ్చి అన్నాను – 'మీరు నన్ను విడచిపెట్టేస్తారు. మీకు నామీద ఏమీ ప్రేమలేదు.'

అక్కా! ఇంకొకప్పుడయితే ఈ ప్రేమబద్ధమయిన మాటలు పంచేసేవో కాని ఇల్లాంటిపట్టునలవల్లనే యెస్టేటులు నాశనమవు తున్నాయి. బంధుత్వాలు చెడుతున్నాయి. స్త్రీదగ్గర ఇంతకు మించిన అస్త్రం లేదు. నేను ఆనంద్ కంఠానికి బాహువులు

చుట్టాను. ఆయనభుజంమీద తలఉంచి ఏడుపుమొదలుపెట్టాను. కాని అప్పుడానంద్ బాబు కఠోరుడయిపోయారు. ఈ ఆగ్రహం ఆయన్నేమీ కదల్చలేకపోయింది. కన్నతల్లి మీదంత కోపమా? మనం మనతల్లిని ఒక్క మాట కఠినంగా మాట్లాడినా సహించలేము. ఈ ఆత్మాభిమానానికేమన్నా హద్దుందా? తల్లి వీరి కోసం సుఖం విలాసం అర్పిస్తుందే! పగలల్లా ఆనందంవిడిచి రాత్రి నిద్రమానేస్తుందే! ఇవేనా ఆశలు! కొడుకుమీద తల్లికీమాత్రం అధికారంలేదు. ఆనంద్, ఆ అవిచల కాఠిన్యంతోటే అన్నారు. 'ఈ కొంపలో నీకేదుర్గతి పట్టించటమే ప్రేమఅయితే నాకా ప్రేమలేదు.'

ప్రొద్దున్నే లేచి బజారుకిపోతూ నాతో అన్నారు. 'నేను వెళ్ళి ఇల్లు కుదుర్చుకువస్తాను. బండీకూడా తీసుకువస్తాను. సిద్ధంగా ఉండాలి.'

నేను గుమ్మానికడ్డంవచ్చి అన్నాను. 'ఏం ఇంకాకోపం శాంతించలేదా?' 'కోపంకాదు. కేవలం ఇతరులమీదనుంచి నాభారం తొలగించుకోవటమే ఉద్దేశ్యం.'

'ఇది మంచిపని కాదు. చూడండి, అమ్మగారికెంత బాధ కలుగుతుందో! మీరు మామగారినైనా ఏమన్నా అడిగారా?'

'ఆయన్నడగవలసిన పనేముంది? కర్త, ధర్త అన్నీ అమ్మే. నాన్నగారు మన్నుదిన్న పాము.'

'ఇంటి యజమానిగదా?'

'నువ్వు వస్తావా? రావా? స్పష్టంగా చెప్పు.'

'నేనుమాత్రం అప్పుడేరాను.'

'సరే, తన్నులుతిను.'

నే నేమీ అనలేదు. ఆనంద్ ఒకక్షణమాగి 'నీదగ్గరేమన్నా డబ్బుంటే నాకియ్యి' అన్నారు.

నాదగ్గర రూపాయలున్నాయి. కాని యివ్వలేదు. బహుశః సందేహంలో పడైనా ఆగిపోతారనుకొన్నా. కాని ఆయన మనస్సులో ధ్రువపరచుకొన్నారు. తిన్నగా అన్నారు. మంచిదే, నీవు రూపాయ లివ్వకపోయినా నా పని ఆగదు. నీకీ విశాల భవనం, ఈ సుఖభోగాలు, నౌకర్లు చాకర్లు సుఖంగాఉన్నాయి. నాతో మాడిచావటమెందుకు? అక్కడీసుఖమెక్కడిది! నా ప్రేమ విలువెంత?' అంటూ వెళ్ళిపోయారు. అక్కా! ఏం చెప్పను! అప్పుడు నా వివశత్వానికెంత దుఃఖంచానో! ఆ దేవుడు నన్నెందుకు తీసుకుపోకూడదనిపించింది. ఈ కులకళం కినివల్ల తల్లీబిడ్డలమధ్య వైమనశ్యం కలుగుతోంది. వెళ్ళి అమ్మగారి కాళ్ళమీదపడ్డాను. ఆనంద్‌బాబు వెళ్ళిపోతూఉన్న సంగతి ఏడుస్తూచెప్పాను. కాని ఆవిడహృదయమేమీ కరగ లేదు. తల్లికూడా ఇంత వజ్రహృదయం కలదవుతుందని నాకిప్పుడు తెలిసింది. అయినప్పు డానందబాబుహృదయ మెందుకు కఠోరంకాదు! ఆ తల్లికొడుకు కా దేమిటి!

తల్లి నిర్దయగా అంది - 'నువ్వుకూడా వాడితో వెళ్ళక పోయినావా! వాడు రమ్మన్నప్పుడు వెళ్ళవలసింది. ఏమో! నేను నీకెప్పుడేం విషంపెడతానో ఎవరుచెప్పగలరు?'

నేను ప్రతిమాలుతూ అన్నాను – 'అమ్మగారూ! ఆయన్ని పిలిపించండి. మీ కాళ్ళమీదపడుతున్నాను. లేకపోతే ఎక్కడి కైనా వెళ్ళిపోతారు.'

అమ్మ ఆ నిర్దయత్వంతోటే అన్నారు. 'పోనీ, ఇష్టమొచ్చిన చోటఉండనీ, వాడు నాకెవ్వడు? ఇప్పుడేమయినా నువ్వే! నా లెక్కెవ్వరికి? ఈ వేళ యీ కాస్త దానికి పీడింత మండిపడుతున్నావు! మా అత్తగారు నన్ను కొన్నివందలసార్లు కొట్టి వుంటుంది. నేనూ చంటిపిల్లనుకాను. నీ ఈడుదాన్నే. అయితే మీ మామగారిదగ్గర నోరెత్తగలిగానా? ఏది పెడితే అదే తిని వుండేదాన్ని. ఏమన్నా పడుండేదాన్ని. ఇల్లా కోపగించుకొని పెట్టి ఎవరూ పారిపోయేవారు కారు. ఇప్పటివాళ్ళేకాదు, ప్రేమంటే మెరుగున్నది! మాకూ ప్రేములుండేవి. కాని లజ్జ, సిగ్గు, తండ్రీ, పిన్నా, పెద్దా తెలియకుండా సంచరించలేదు.'

అంటూ ఆవిడ పూజచేసుకోవటానికి వెళ్ళిపోయారు. నేను నా గదిలోకివచ్చి 'నా కర్మ' అనుకొని ఏడుస్తున్నాను. ఆనంద్ ఎక్కడికీ వెళ్ళిపోరుగదా అని నా సందేహం! ఏమాపాయలేనా ఎందుకిచ్చానుగానని విచారం. పాపం, అక్కడక్కడా తిరుగుతూ ఉంటారు. ఇంకా ముఖమేనా కడుక్కోలేదు. కాఫీ త్రాగేరో లేదో. సమయముకి తిండితినకపోతే ఆరోగ్యం చెడుతుంది. జ్వరం వస్తుంది. దాసీదాన్ని బాబూజీ గదిలో ఉన్నారేమో చూడమన్నాను. అదిచూచివచ్చి 'గదిలో ఎవరూ లేరు. చిలక కొయ్యని బట్టలుకూడా లే'వంది. నే నడిగాను – 'మును పెప్పుడైనా ఇల్లా తల్లిమీద కోపగించారా?' దాసీదంది–'ఎప్పుడూ

లేదు కోడలుగారూ! ఇంత మంచిపిల్లవాణ్ణి నేను చూడలేదు. అమ్మగారి నుంచి చెప్పడూ తలెత్తేవారు కాదు. మరి యీ వేళ [illegible] ఆగిపోయారో తెలియదు.'

మధ్యాహ్నం భోజనంకొట్టుకి వస్తారని నాకు విశ్వాసం ఉంది. కాని రెండు గంటలేమిటి - సాయంత్రంకూడా అయిపోయింది. ఆయనజాడ లేదు. రాత్రి తెల్లవార్లూ మేలుకునే ఉన్నాను. కాని రాత్రికూడా అల్లాగే గడిచిపోయింది, అక్కా! ఇల్లా మూడురోజులు గడిచాయి. అప్పుడుకనక నీవు చూస్తే నన్ను గుర్తించలేకపోయేదానవు. ఏడ్చేడ్చి కళ్ళుఉబ్బాయి. ఈ మూడురోజులు ఒక్కక్షణమైనా నిద్రపోలేదు. నీళ్ళైనా త్రాగలేదంటే ఆకలిమాట ఇక చెప్పేదేముంది! దాహమే వేయటం లేదు. దేహంలో ప్రాణాలే లేనట్టు అనిపించేది. కొంపంతా దుఃఖవ్యాప్తమైంది. అమ్మగారు [illegible] రెండుపూటలా కూర్చుంటోంది. నోరు అంటుకుపోయేటట్టు [illegible] కాస్తోంది. ఆడపడుచులిద్దరికీ కేరింతలు, నవ్వులు మాయమయిపోయాయి. చిన్నాడపడుచు తన అపరాధం [illegible] నాదగ్గరకు వచ్చింది

నాలుగోరోజున ప్రొద్దున వంటవాడు వచ్చి నాతో అన్నాడు.

'బాబు నాకిప్పుడు దశాశ్వమేధఘాట్లలో కనిపించారు. నే నాయన్ని చూడగానే పరుగెత్తుకొని దగ్గరకు వెళ్ళి అన్నాను. 'భైయా! ఇంటికి రావేం? అంతా కంగారుపడుతున్నారు. కోడలు గారు మూడురోజులనుంచీ మంచినీళ్ళైనా త్రాగలేదు. ఆమె పరిస్థితి అధ్వానంగా వుంది.' అన్నాను. ఈ మాటలువిని ఆయ

కొంచెము ఆలోచనలోపడ్డారు. అన్నారు. కోడలుగారెందుకు తిండితిప్పలు మానేసింది? విశ్రాంతికోసం ఆ కొంప వదలలేక పోయారుగా! అప్పుడే దానితో మొహం మొత్తింది! అని అడుగు వెళ్ళి అమ్మగారప్పుడే నడవలోనికివచ్చారు. వంటవాడి మాటలు వినగానే అడిగారు 'ఏం' అలుగూ! ఆనంద్ కని పించాడా?

వంట:- కనిపించాడమ్మా! ఇప్పుడే దశాశ్వఘాట్‌లో కనిపించారు. ఇంటికి రావటంలేదేమంటే ఆ యింటిలో నా కెవ్వరున్నా రన్నాడు.

అమ్మ:- ఎవరూ లేకపోతే నీ పెళ్ళాం లేదా? దాని ప్రాణం తీస్తున్నావెందుకని అనపోయావూ!

వంట:- నేను చాలా తెలియజెప్పానమ్మా! ససేమిరా వినందే?

అమ్మ:- ఏంచేస్తున్నాడు?

వంట:- అది నే నడగలేదు. కాని ఆయన ముఖం బాగా వాడిపోయింది.

అమ్మ:- నీవు ముసలాడవయినకొద్దీ మతిమాలినవాడ వవుతున్నావు. ఎక్కడుంటున్నావు? ఎక్కడ తింటున్నావు? అని అడగవద్దూ! అసలు వాడిచెయ్యిపట్టుకొని యింటికి లాక్కు రావలసింది. కాని మీలాంటి జీతగాళ్ళ కేముంది? మీ తిండి మీకొక్కావాలి. ఎవరు చస్తేనేం? ఎవరు బ్రతికితేనేం! రెండు పూటలా కంచెడెక్కిస్తావు. కాలిమీద కాలువేసుక కూర్చుంటావు. ఇంట్లో మఱొకడు తింటే నీకేం; తినకపోతే నీకేం?

సరే! నేనేం లెక్క చేయను. వాడు రానీ రాకపోనీ; నా ధర్మం పెంచటం. పెంచాను. ఇంకెక్కడున్నా సరే వాడిష్టం. మఱి ఈ కోడల్నేం చెయ్యాను? అది ఏడ్చేడ్చి ప్రాణాలు పోగొట్టు కొంటోంది. నీకు దేవుడు బాగా కళ్ళిచ్చాడుగా! దాని పరిస్థితి చూస్తున్నావు. కోడలు అన్నంతినడం మానేసి పడుకొందని ఇంతమాత్రం మాట పెగలిరాలేదూ నీ నోటివెంట?

వంట:- దేవుడుతోడమ్మా! నేను చాలాసార్లు చెప్పాను. ఆయన పారిపోతూంటే నేనేం చేసేది?

అమ్మ:-చెప్పటంకాదు; నీ తలకాయ. నీవు చెపితే వాడిల్లా పారిపోతాడా? ఇల్లాంటికబుర్లు నా దగ్గిర ఎప్పుడూ చెప్పకు. ఈ కోడలికి నేనేం చెప్పను? మాఆయన నా దగ్గిఱ ఇల్లా ప్రవ ర్తించిఉంటే, నే నాయనముఖమే నా చూచిపుండేదాన్ని కాను. కాని దీన్ని వాడేం మాయచేశాడో! ఇల్లాంటివాళ్ళకి కులట దొరకాలి. బాగా ఆశించేది'

ఇంకో అరగంటలో నీళ్ల మనిషి వచ్చి 'బాపూజీ వచ్చి గదిలో కూర్చున్నారు' అన్నాడు.

నా గుండెదడ పట్టుకుంది. వెళ్ళి లాక్కొద్దామనిపించింది. కాని అమ్మగారిహృదయం నిజంగా వజ్రమే. అన్నారు — 'ఇక్కడెవరున్నా రాయనకి, వచ్చి కూర్చోటానికని ముందు వెళ్ళి అడుగు!'

నేను దణ్ణంపెట్టి అన్నాను-ఆయన్ని లోపలికి తీసుకురండి; మళ్ళీ ఎక్కడికైనా వెళ్ళిపోతారు.

అమ్మ- రావడానికి వాడికెవరున్నా రిక్కడ? నేను లోపల అడుగుపెట్టనివ్వను.

అమ్మగారు కోప్పడుతున్నారు. చిన్నఆడబడుచు అటు వెళ్ళి ఆనంద్‌బాబుని తీసుకువచ్చింది. నిజంగా ఆయనముఖం వాడిపోయింది. ఎన్నో నెలలతరబడి రోగంపడ్డవాడి ముఖంలా వుంది. పిల్ల నత్త వారింటికి తీసుకువెళుతోన్నట్లు లాక్కొస్తుం దావిడ. అమ్మగారు నవ్వుతూ అన్నారు-'వాణ్ణిక్కడి కెందుకు తీసుకొచ్చావు? వాడికిక్కడ ఎవరున్నారు?'

ఆనంద్ తలవంచుకొని అపరాధిలాగ నిలబడ్డాడు. మాట్లా డటంలేదు. అమ్మగా రడిగారు—'నాల్గురోజులనుంచీ ఎక్క డున్నావు?'

'ఎక్కడా లేదు; ఇక్కడే ఉన్నాను.'

'బాగా ఆనందంగా ఉండివుంటావు.'

ఆఁ 'ఏం బాధ లేదు.'

'ఆ వాలకంచూస్తేనే తెలుస్తోంది.'

వదినె మిఠాయి తెచ్చింది. ఆనంద్ మిఠాయితింటూ అత్త వారింటికివచ్చినట్లు సిగ్గుపడుతున్నారు. తర్వాత తల్లి ఆయన్ని తనగదిలోకి తీసుకువెళ్ళింది. అక్కడొక అరగంట మాట్లాడు కొన్నారు. అటే ఆలకించానుగాని సరిగ్గా వినిపించలేదు. అప్పు డప్పుడు తల్లి ఏడవటం, మధ్యమధ్య ఆనంద్ ఏడవడమూను. ఆవిడ పూజచేసుకోవడానికి వచ్చేసరికి, ఆవిడకళ్ళు ఎర్రగా ఉన్నాయి. ఇక ఆనంద్ అక్కడనుంచి తిన్నగా నా గదిలోకి

వచ్చారు. ఆయన రావటంచూచి ఏమీ తెలియనిదానిలాగ మొహం ముట్టుత్రిప్పుకొని నిద్రపోతూవున్నట్టు పండుకొన్నాను. గదిలోకివచ్చి నేను పడుకోవటంచూచి, దగ్గఱకువచ్చి మెల్లగా పిలిచారు; తిరిగి వెళ్ళిపోతున్నారు. నన్ను లేపటానికి సాహసం లేకపోయింది. నాకు కలుగుతూవున్న కష్టానికి తామే కారణమని లోలోపల చింతిస్తున్నారు. ఆయన నన్ను లేపుతారనీ, నేను గునుస్తాననీ, ఆయన బతిమాలుతారనీ, అనుకొన్నాను— కాని నా ఆశలన్నీ నిరాశలయ్యాయి. ఆయన వెళ్లిపోతోంటే నేనుండలేకపోయాను. నేను చప్పునలేచాను. ముందడుగబోతే నాకాళ్ళు వణికాయి. పడిపోతున్నట్టనిపించింది. వెంటనే వెనక్కి-తిరిగి ఆనంద్ నన్ను పట్టుకొన్నారు.

'పడుకో-పడుకో! నేను కుర్చీమీద కూర్చుంటున్నాను. ఏమిటి నీ పరిస్థితి ఇల్లా తెచ్చుకొన్నావు?'

నేను సరిగాసర్దుకొని అన్నాను—'నేను బాగానేఉన్నాను. మీ రిల్లాం చేశారేమిటి?'

'ముందు లేచి నువ్వు కాస్త అన్నంతింటే, నేను తర్వాత మాట్లాడతాను.'

'నా భోజనంసంగతి మీకేం పట్టింది? తమరు షైరులు చేస్తున్నారుగా!'

'ఎల్లాంటిషైరులు చేశానో నా మనస్సుకే తెలుసు. మఱి తర్వాత మాట్లాడుకుందాం; ముందు కాళ్ళుచేతులు కడుక్కొని తిండితిను. నాల్గురోజులు నీళ్లైనా నోట్లో పోసుకోలేదు! రామ! రామ!'

నేను నాలుగురోజులనుంచి నీళ్లైనా త్రాగ లేదని మీకు ఎవరు చెప్పారు? మీకు నా లెక్కేమీ లేనప్పుడు, నేను తిండీ, నీళ్ళు ఎందుకు మానుతాను?'

'అది ముఖమే చెప్తోంది; పువ్వులా వాడిపోయి.'

'కాస్త తమరిఆకారం అద్దంలో చూచుకోండి వెళ్లి.'

'నే నేం మును పేమన్నా అందగాణ్ణా? మోడుకి నీరుపోస్తే ఎంత; పొయ్యకపోతే ఎంత? నీ పీ నిరసనవ్రతం పడతావను కోలేదు. లేకపోతే ఆ భగవంతుడికి తెలుసు. నేను అమ్మకొట్టి తరిమితేమాత్రం వెళ్ళేవాణ్ణా?'

నేను తిరస్కారదృష్టితో చూచి అన్నాను-'అయితే నిజంగా నేను హాయిగానే యిక్కడున్నా ననుకొన్నారా?'

ఆనంద్ వెంటనే తనతప్పుసర్దుకొని అన్నారు-'కాదు. కాదు. నేనంత గాడిదనుకాను. కాని నువ్వు బొత్తిగా తిండి మానేస్తావని కల్లోనైనా అనుకోలేదు. అదృష్టమే. నాకు వాడు కనిపించాడు. లేకపోతే నీవు ప్రాణాలర్పించేదానవు. ఇంకెప్పుడూ ఇల్లాంటి పొరపాటు జరగదు. లెంపలు వేసుకొంటున్నాను. అమ్మ నీ పరిస్థితంతా చెప్పి చెప్పి ఏడుస్తూకూర్చుంది.'

నే నెంతో ప్రసన్నతజెంది అన్నాను-అయితే నా తపస్సు ఫలించింది.'

'కొంచె పాలు త్రాగితే మాట్లాడవచ్చు. ఎన్నిమాటలూ మాట్లాడోలో!'

'త్రాగుతాను! తొందరేం?'

'నువ్వేదో తినేదాకా నా తప్పు క్షమించలేదన్నమాటే.

'మళ్ళీ ఇల్లాఎప్పుడూ కోపగించి పారిపోనని మీరు గట్టిగా మాటిచ్చేదాకా తిండి తినను.'

'మనస్ఫూర్తిగా ప్రమాణం చేస్తున్నాను.'

అక్కా! మూడురోజులు కష్టమయితే అయింది. కాని అందుకు నాకేమీ బాధలేదు. ఈ మూడురోజుల ఉపవాసమూ మా హృదయాల్లో కల్పించిన పారిశుద్ధ్యం,ఇంక మరొకవిధంగా ఎల్లాగా ఎప్పటికీ కలిగేదిగాదు. ఇంక మా జీవితం ప్రశాంతంగా గడుస్తుందని నాకు ఎంతో విశ్వాసం కలిగింది. నీ సమాచారం శీఘ్రంగా, అతి శీఘ్రంగా వ్రాయి.

నీ సీత.



# 13

ఢిల్లీ, 20-2-26.

నెచ్చెలీ!

నీ ఉత్తరం చదివితే నీమీద నాకు దయకలిగింది. నీవు నన్నేమైనా అను. నేనుమాత్రం ఈ దుర్గతినెప్పుడూ సహించ లేను. అసలు సహించేదాన్నే కాను. నేను చచ్చేనాపోయేదాన్ని; లేక ఆ అత్తగారిముఖమేనా చూడకుండా పారిపోయేదాన్ని. నీ

మంచితనం, నీ సహనశీలత, నీ పతిభక్తి నీకే చెల్లు. నేనయితే ఆనంద్‌తోపాటు అప్పుడే లేచిపోయేదాన్ని. ముష్టెత్తుకోవలసి వచ్చినా మళ్ళీ ఆ కొంపలో అడుగుపెట్టేదాన్నికాను. నాకు నీమీద జాలేకాదు; కోపంకూడా వస్తోంది. ఎందుకో తెలుసా? నీకు ఏమాత్రం స్వాభిమానంలేదని. నీలాంటిఆడవాళ్ళవల్లే ఈ అత్తగార్లకీ, మగవాళ్ళకీ బాగా కళ్ళు నెత్తిమీదకెక్కాయి. మనకి గౌరవమేలేనప్పుడా కొంప ఎల్లా నాశనమైతేనేం? నా దృష్టిలో పతిప్రేమకూడా ఇల్లాంటిది కాదు. నీవు పందొమ్మిదవశతాబ్దంలో పుట్టివుండవలసినదానవు. అప్పుడు నీ గుణాలకి ప్రశంసఉండేది. ఈ స్వాతంత్ర్యయుగంలో, స్త్రీస్వాతంత్ర్యపు నవయుగంలోకాదు. నీవు కేవలం ప్రాచీనయుగంలో పుట్టవలసినదానవు. ఇది సీతాదమయంతులయుగం కాదు. పురుషులు చాలాకాలం రాజ్యంచేశారు. ఇంక రాజ్యమేలటం స్త్రీజాతి దవుతుంది. కాని నిన్నింతకంటె ఏమీ అనను.

ఇంక నాకథ విను. పేపర్లో నాసుజబ్బుచేసిందని ప్రకటిద్దామనుకొన్నాను. కాని యీ వార్త ప్రచురింపబడేసరికి మిత్రులంతా వచ్చేస్తారనిపించింది. ఎల్లాఉందని అడగటాని కొకరూ, చూడటాని కింకొకరూవస్తారు. కాకపోయినా నా ఆరోగ్యాన్ని గురించి రోజూ ప్రచురించటానికి నే నేమన్నా రాణీనా! లోకు లేమనుకుంటారో! అందుచేతనే పేపర్లో ప్రచురించే ఆలోచన మానేశాను. ఆ పగలెల్ల నే పడ్డబాధ యిల్లాంటిదని వ్రాయలేను. విషం త్రాగుదామనిపించేది. ఎక్కడికైనా పోదామనిపించేది. వినోద్‌నిగురించి రకరకాల అనుమానాలు కలిగేవి. వినోద్‌కి నే నౌదాసీన్యం చూపించినప్పటి విషయాలెన్నో జ్ఞాప

కం వచ్చాయి. నేనాయనదగ్గరనుంచి సర్వస్వం స్వీకరించాలనుకొనేదాన్ని; కాని యేమీ యివ్వాలనుండేదికాదు. ఆయనెప్పుడూ నా దగ్గర భ్రమరంలా తిరుగుతూఉండా లనుకొనేదాన్ని. ఆయన అస్తమానం పుస్తకాలలోను, పేపర్లలోనూ మునిగిపోతూఉండటం చూస్తే నాకు కోపం వచ్చేది. చాలా సేపు నాకు సింగారించుకొనేందుకే సరిపొయ్యేది. ఆయనవిషయంలో నాకేమీ చింత ఉండేదికాదు. సేవయొక్క మహిమ సౌందర్యంకంటే చాలాగొప్పదని నాకిప్పుడిప్పుడే తెలిసింది. రూపం మనస్సునాకర్షిస్తుందికాని, ఆత్మానందం కలిగించే వస్తువు వేరేఉంది.

ఇల్లా ఒకవారం గడిచింది. ఆవేళప్రొద్దునే నేను పుట్టింటికి బయలుదేరబోతున్నాను. ఇల్లు శూన్యంగా ఉంది. ఇంతలో పోస్టుజవాను నాకొక ఉత్తరం ఇచ్చాడు. నా గుండె దడదడా కొట్టుకొంది. కంగారుపడుతూ నేనుత్తరం తీసుకున్నాను. కాని పై దస్తూరీ వినోద్‌ది కాదు. వ్రాత ఎవరిదో స్త్రీది. ఆ వ్రాత నాకసలు పరిచయంలేదు. తీరా కవరుచింపి సంతకం చూద్దునుగదా! అది కుసుమ ఉత్తరం. ఒక్క-గుక్కలో ఉత్తరమంతా చదివేశాను. ఇల్లా వ్రాసింది-'సోదరీ! వినోద్ బాబు మూడురోజు లిక్కడుండి బొంబాయి వెళ్ళారు-'ఫారెన్' వెళ్ళాలనుకొంటూన్నట్టుంది. మూడు నాల్గురోజులుమాత్రం బొంబాయిలో ఉంటారు. నేనెల్లాగైనా ఆయన్ని తిరిగి ఢిల్లీ పంపాలని చూచాను. కాని ఏమైనాసరే ఆయన ఒప్పుకోలేదు. నీ వాయన కీ క్రిందిఎడ్రసుకి టెలిగ్రాము ఇయ్యి. నేనాయన్ని అడ్రసడిగాను. ఆయన ఈ అడ్రసును రహస్యంగా ఉంచమని

న న్నాజ్ఞాపించారు. కాని నీదగ్గర చావేమిటి? నువ్వు వెంటనే తంతినియ్యి. బహుశః ఆయన ఆగిపోవచ్చు. సంగతేమిటో ఎంత అడిగినా వినోద్ నాతో చెప్పలేదు. కాని ఆయన చాలవిచారంగా ఉన్నారు. ఇల్లాంటిమనిషినికూడా నీవు నీవాణ్ణి చేసుకోలేకపోయావంటే నా కాశ్చర్యమయింది. కాని నాకు మొదటినుంచీ దీన్ని గురించి అనుమానంగానే ఉందిలే. రూపగర్వాలకి, దీపప్రకాశాలకున్న సంబంధముంది. గర్వం రూపంయొక్క ప్రకాశం...'

నేనుత్తరం అక్కడపడేశాను. వెంటనే వినోద్ పేర 'చాల జబ్బుగాఉన్నాను. వెంటనేరమ్మ'ని తంతినిచ్చాను. వినోద్ తంతిద్వారా జవాబిస్తారని ఆశించాను. జవాబేమీ రాలేదు. కాని రోజంతా గడిచిపోయింది. గుమ్మంలోనుంచి ఏదైనా సైకిలువెళుతున్నా, టెలిగ్రాంబంట్రోతనే అనుకొని చూచేదాన్ని. రాత్రికూడా టెలిగ్రాంకోసం ఎదురుచూస్తూఉన్నాను. అప్పుడు వినోద్ వస్తున్నారేమో! ఇంక టెలిగ్రామెందుకని యివ్వలేదుగ్గాబోలు ననుకొన్నాను.

ఇంక నా మనస్సులో అనుమానాలు ప్రారంభమైనాయి. వినోద్ కుసుమదగ్గఱకెందుకు వెళ్ళారు? కుసుమమీద ఈయనికి ప్రేమలేదుగదా! దానివల్లనే నామీద విరక్తులయిపోలేదుగదా! కుసుమ ఏమీ టక్కరిచేయటంలేదుగదా! అసలు దానికి వినోద్ నక్కడనుంచుకొనే అధికారమెక్కడది? ఈ ఆలోచనలతో నా మనస్సు వికలమైంది. కుసుమమీదకూడా కోపంవచ్చింది. బహుశః వీళ్ళిద్దఱికి చాలరోజులనుంచి ఉత్తర ప్రత్యుత్తరాలు జోరుగా జరుగుతునేఉంటవి. నేనుమళ్ళీ కుసుమ

ఉత్తరం చదివాను. ఇప్పుడా మొమాటల్లో ప్రతిదాంట్లోనూ ఆలోచనకు కొంతసామర్థ్యం ఏర్పడింది. కుసుమకొక ఉత్తరం వ్రాసి చీవాట్లుపెట్టాలనుకొన్నాను. వెంటనే సగంఉత్తరం వ్రాశాను కూడా. కాని అది చింపేశాను. అప్పుడే వినోద్‌కొక ఉత్తరం వ్రాశాను. మనం కలుసుకొంటే ఆ ఉత్తరంలో వ్రాసినవి చెప్తాను. నా నోటికివచ్చినట్లు వ్రాసిపారేశాననుకో. కాని కుసుమకు వ్రాసిన ఉత్తరానికి పట్టినగతే దీనికీపట్టింది. వ్రాశే శాక అదొక లిఖిత హృదయంయొక్క వ్యర్థవాదమనిపించింది. నాకుమాత్రం ఆయన తప్పకుండా కుసుమదగ్గరనే ఉన్నారనే ఉంది. ఆజ్ఞానే ఆయన్ని మాయచేస్తోంది. ఆ రోజుకూడా గడిచి పోయింది. పోష్టువాడెన్నిసార్లో వచ్చాడుకాని, నేనువాడికేసి చూడనైనాలేదు. సీతా! ఈ హృదయావస్థ నేనుచెప్పలేను! కుసుమ కనిపిస్తే అప్పుడేం చేసేదాన్నో!

రాత్రి పడుకొన్నాక 'ఆయనగారు యూరప్ వెళ్ళిపోలేదు గదా?' అనిపించింది. మనశ్శాంతి తగ్గిపోతోంది. బుద్ధి తిరిగి పోతోంది. నాకు 'నీటిలో మునిగిపోతున్నానా?' అనిపించింది, ఆయనకనుక యూరప్ వెళ్ళిపోతే యింక ఆశేమీలేదు. వెంటనే లేచాను. గడియారం చూశాను. రెండయింది. నౌకర్ని లేపి నేను టెలిగ్రాఫ్ఆఫీసుకి చేరాను. బాబూజీ కుర్చీలోపడుకొని నిద్రపోతున్నారు. అతికష్టంమీద ఆయన నిద్రలోంచి మే॰ కొన్నారు. నేను 'రిప్లైపెయిడ్ టెలిగ్రాం' ఇచ్చాను. ఆయ॰ టెలిగ్రాం ఇచ్చేసినతర్వాత 'దీనికి జవాబెప్పటికి వస్తుందండీ?' అని అడిగాను.

ఆయనన్నాడు – 'ఈ ప్రశ్న ఏ జ్యోతిష్కుణ్ణైనా అడగండి. ఆయన జవాబెప్పుడిస్తారో ఎవరికి తెలుసు? టెలిగ్రాఫ్ వాళ్ళు ఆయనచేత బలవంతంగా జవాబు వ్రాయించలేరుగదా?' ఏమీ ఆటంకం లేకపోతే ఎనిమిది తొమ్మిదిగంటలకి జవాబురావాలి.'

కంగారులో మనిషిబుద్ధి నశిస్తుంది. ఈ నిరర్థక ప్రశ్న వేసి నందుకు నేనే సిగ్గుపడ్డాను. ఆయన తనమనస్సులో నన్నెంత మూర్ఖురాల ననుకొంటాడు! సరే, నేనక్కడే బెంచీమీద కూర్చున్నాను. నీకు నమ్మకం కలగదేమోగాని, తొమ్మిదయ్యే దాకా అక్కడే కూర్చొనిఉన్నాను. చూడు, ఎన్నిగంటలో! నిండా ఏడుగంటలు! బోలెడుమంది వచ్చారు, వెళ్ళారు. నేనుమాత్రమక్కడే పాతుకుపోయాను. టెలిగ్రాఫ్ చప్పుడయ్యే సరికి నాగుండె కొట్టుకోవటం మొదలుపెట్టేది. కాని ఆయ నెక్కడ కోపపడతాడోఅని ఏమీఅడగటానికి ధైర్యముండేది కాదు. ఆఫీసు గడియారం తొమ్మిదికొట్టాక, నేను బెదురు తూనే 'ఇంకా జవాబు రాలేదాఅండి' అన్నాను.

ఆయన– 'మీరు ఇక్కడే కూర్చొనిఉన్నారుగదా! జవాబు వస్తే నేనేం తినేస్తానా?' అన్నాడు. నేను ధైర్యంచేసి మళ్ళీ 'అయితే ఇప్పుడురాదా?' అనడిగాను. ఆయన ముఖం అటు త్రిప్పుకొని 'ఇంకా రెండుమూడు గంటలు కూర్చొనిఉండండి' అన్నాడు.

చెల్లీ! ఈమాట బాణంలా హృదయానికి గుచ్చుకొంది. కళ్ళవెంట నీళ్ళువచ్చాయి. అయినా నేనక్కడనుంచి కదల లేదు. బహుశః జవాబు వస్తూఉండవచ్చునని ఇంకా ఆశఉంది.

ఇంకో రెండుగంటలుకూడా గడిచేసరికి నిరాశకలిగింది. అయ్యో వినోద్ నన్నెందుకూ కొఱగాకుండా చేశారు. నాలెక్కలేదు. నేనింటికి బయలుదేరాను. కన్నీళ్ళు ధారగా పడుతున్నాయి. దారి కనిపించటంలేదు.

వెనుకనుంచి ఒక కారుహారన్ వినిపించింది. దారినుంచి తప్పుకొన్నాను. ఆ కారుక్రిందపడి జీవిత మంతటితో అంతం చేసుకొందామనిపించిం దప్పుడు. కళ్ళు తుడుచుకొని కారు కేసి చూచాను. భువన్ కూర్చొనిఉన్నాడు. అతనిప్రక్క కుసుమ కూర్చొనిఉంది. నా కరికాలుమంట నెత్తికెక్కింది. వాళ్ళిద్దఱి కంటా పడకుండా పోవాలనుకొంటున్నాను; గాని మోటారు ఆగింది. కుసుమదిగి నన్ను కౌగలించుకొంది. భువన్ మాట్లాడ కుండా నన్నెరగనే ఎరగనట్లు కూర్చున్నాడు కారులో. నిర్దయి! ధూర్తుడు!

కుసుమ అడిగింది – 'నేను నీదగ్గఱకే వస్తున్నానమ్మా! అక్కడనుంచేమన్నా కబురువచ్చిందా?' అని. నేను మాట తప్పించటానికి 'నీ వెప్పుడు వచ్చా'వన్నాను. ఆ భువన్ ఎదుట నా కష్టగాథ నేను చెప్పదలచుకోలేదు.

కుసుమ – 'రా. కారులో కూర్చో.'

'వద్దు. నే వెళ్ళిపోతాను. వీలయితే ఒకసారి రా!'

కుసుమ నన్నేమీ బలవంత పెట్టలేదు. కారులో కూర్చొని వెళ్ళిపోయింది. నేను చూస్తూఉండిపోయాను. ఈమె ఆ కుసుమేనా? మఱియొకతా? ఎంతభేదం వచ్చింది?

నే నింటికి వెడుతూ అనుకొన్నాను. ఈ భువన్‌తోటి దీనికి పరిచయమెల్లా కలిగింది? నాసంగతి కనుక్కోటానికే వినోద్ దీన్ని పంపలేదుగదా! నన్నుగురించి భువన్నేమన్నా అడగటానికి వచ్చిందా?

నేనూ ఇంటికి జేరుకొన్నాను. కుసుమవచ్చింది. ఇప్పుడు మోటారులో ఆమెఒక్కతే లేదు. వినోద్ కూర్చొనిఉన్నారు. నే నాయన్ని చూచి నిర్ఘాంతపోయాను. పరుగెత్తుకువెళ్ళి ఆయన చేయిపట్టుకొని కారులోంచి దింపి తీసుకురావలసింది. కాని నేనుమాత్రం ఉన్నచోటునుంచికదలలేదు. విగ్రహంలా కూర్చున్నాను. నా మానినీప్రకృతి తనఉద్దండరూపం చూపడానికి బాగావికలమైపోయింది. క్షణంలో కుసుమ వినోద్‌ని దింపింది. ఆయనచేయి పట్టుకొని తీసుకువచ్చింది. వినోద్ ముఖంచూస్తే చాల పాలిపోయిఉంది. స్వయంగా నిలబడలేనంత అశక్తులయి పోయూరు. నే నప్పుడు కంగారుపడి, ఇల్లా అయిపోయూరేమిటని అడిగాను.

కుసుమ అన్నది – 'సంగతి తర్వాతఅడుగు. కొంచెం ఈయనకి మంచం త్వరగావాల్చు. కాసిని పాలు తెప్పించు.'

నేను వెంటనే మంచం వాల్చాను. వినోద్‌ని దానిమీద పడుకోబెట్టాను. పాలు సిద్ధంగానే ఉన్నాయి. అప్పుడు నాకు కుసుమ స్వామినిఅయింది. నే నామెకనుసన్నలలో మెలుగుతున్నాను. సీతా! కుసుమమీద వినోద్‌కి ఉన్నవిశ్వాసం నాయందులేదని అప్పుడు నా కర్థమయింది. నే నందుకు తగను. నాహృదయం వందప్రశ్న లడగటానికి కంగారుపడుతోంది.

కాని కుసుమ ఒక్క_క్షణమేనా వినోద్‌ని విడిచిపెట్టటం లేదు. సమయమందొరికితే ఇల్లాంటప్పుడుకూడా వినోద్‌ని ప్రశ్నలతో ముంచెత్తేసేటంత మూర్ఖురాలిని నేను.

వినోద్‌కి నిద్రపట్టాక కళ్ళనీళ్ళతో నేను కుసుమనడిగాను - 'సోదరీ! ఈయనకేం జబ్బుచేసింది? నేను టెలిగ్రామిచ్చాను. దానికి జవాబురాలేదు. రాత్రి రెండుగంటలకి 'అర్జెంటు రిప్లై పెయిడ్ టెలిగ్రాం' ఇచ్చాను. పది గంటలయ్యేదాకా టెలిగ్రాఫ్ ఆఫీసులోనే జవాబుకోసం ఎదురుచూస్తూ కూర్చొని ఉన్నాను. అక్కడనుంచే వస్తూఉంటే దారిలో నీవు కనిపించావు. ఈయన నీ కెక్కడ కనిపించారు?'

కుసుమ నా చేతులుపట్టుకొని యింకొకగదిలోకి తీసుకువెళ్ళి అడిగింది - 'ముందు నీవు భువన వ్యవహార మేమిటో చెప్పు. చూడు? స్పష్టంగా చెప్పాలి' నేనడ్డంవచ్చి అన్నాను- 'కుసుమా! నీ వీ ప్రశ్నఅడిగి నాకు చాలాఅన్యాయం చేస్తున్నావు. ఈ విషయంలో ఏమీ సారంలేదని నీవే తెలిసికొనిఉండవలసింది. వినోద్‌కి కేవలం భ్రమకలిగింది.'

'కారణం లేకుండానే?'

'అవును. నా దృష్టిలో కారణమేమీ లేదు...'

'నే నిది ఒప్పుకోను. వినోద్‌ని బాధపెట్టటానికి, విసిగించటానికి, మేల్కొలుపటానికి, ఈ నాటకం ఆడానని చెప్పవేం?'

కుసుమఆలోచన కాశ్చర్యపడి అన్నాను - 'అది కేవలం పరిహాసం.'

'నీకది పరిహాసం. వినోద్‌కి వజ్రఘాతం. నీ విన్నాళ్ళాయ నతో కాపరంచేసికూడా ఆయనర్థం చేసికోలేకపోయావు. నీకు నీ సింగారింపుముందు ఆయనర్థం చేసుకోనేందు కెక్కడ కాళీఉంది! బహుశః ఈ నీ మోహినీసూత్రమే సర్వస్వమూ అనుకొంటున్నావేమో! నేనూ చెప్తున్నాను విను. దీనివిలువ రెండుమూడు నెలలుమాత్రమే ఉండగలుగుతుంది. స్థిరమైన వస్తువు మఱొకటి ఉంది.'

నేను పొరపాటు ఒప్పుకొంటూ అన్నాను. 'వినోద్ నన్నే మన్నా అడిగిఉండవలసిందిగదా!'

కుసుమ నవ్వి అంది— 'ఇదే ఆయనచేయలేనిది. నిన్నిలాంటి మాటలడగటం ఆయనకి అసంభవం. స్త్రీవల్ల తిరస్కరింపబడి ఇంక బ్రతకలేని ప్రాణులలో వాడాయన. స్త్రీ పురుషులలో ఎవరికీ, ధార్మికంగాగాని, నైతికంగాగాని బంధనం ఆయనకి గిట్టదు. ప్రత్యేకప్రాణికి పూర్ణస్వాతంత్ర్యం కావాలనేది సమర్థిస్తారాయన. మానసికేచ్ఛ తప్పితే ఇంకేయితర బంధనమూ ఆయనంగీకరించరు. ఈ విషయంలో ఆయనతో నేనుబాగా చర్చించాను.

'సరే, నా ఎడ్రస్ ఆయనకి తెలియనే తెలుసు. ఇక్కడనుంచి తిన్నగా నాదగ్గరకి వచ్చారు. ఆయన్నిచూచి మిాలోమిాకు పడలేదనుకొన్నాను. నాకు నీమిాద అనుమానం కలిగింది.'

నే నడిగాను – 'ఏం? నామిాద నీకు సందేహం ఎందుకు కలిగింది?'

'నిన్న ముసుపు చూచివున్నానుకనుక'

'ఇప్పుడు నీకు నామీద సందేహంలేదా?

'లేదు. కాని దానికి నీ నిగ్రహం కారణంకాదు. పరంపర నేనిప్పుడు స్పష్టంగామాట్లాడదలచాను. అందుకు క్షమించాలి.'

'నాకు వినోద్‌మీద ప్రేమ లేదనుకొంటున్నావా ?'

'కాదు. వినోద్ మీద నీకున్న ప్రేమకంటె నీమీద నికెక్కువ ప్రేమఉంది. పదిరోజుల్రకితంవరకూ ఈ విషయమే. లేకపోతే ఈ పరిస్థితెందుకు వస్తుంది? వినోద్ ఇక్కడనుంచి తిన్నగా నాదగ్గఱకు వచ్చారు. రెండుమూడురోజులుండి బొంబాయి వెళ్ళారు. నేను చాలావిధాల అడిగాను. కాని ఏమీచెప్పలేదు. అక్కడాయన ఒకనాడు విషంత్రాగారు.'

'నా ముఖంరంగు మారిపోయింది.'

'బొంబాయిచేరగానే నాకొకఉత్తరం వ్రాశారు. దానిలో ఇక్కడిసంగతులన్నీ వ్రాశారు. చివరికిల్లా వ్రాశారు. 'నే నీ జీవితంలో విసిగిపోయాను. ఇంకనాకు మృత్యువుతప్ప ఉపాయములేదు.'

'నేనొక నిట్టూర్పు విడిచాను.'

'నే నా ఉత్తరం చూచుకొని హడలిపోయాను. వెంటనే బొంబాయికి వెళ్ళాను. అక్కడికిచేరేసరికి వినోద్ మరణాసన్నంగాఉన్నారు. బ్రతుకుతారనే ఆశ ఏమీలేదు. నా బంధువొకడక్కడ డాక్టరు. ఆయన్ని తీసుకువచ్చి చూపిస్తే 'ఈయన విషంత్రాగా'రని చెప్పాడు. వెంటనే మందిచ్చారు. మూడు రోజులదాకా డాక్టరుగారు పగటిని పగలనీ, రాత్రిని రాత్రనీ

అనుకోలేదు. నేను క్షణమైనా వినోద్‌ని వదలలేదు. మూడవ నాడీయన కళ్ళు తెరచారు. నీ మొదటి టెలిగ్రాం నాకందింది. కాని దానికి జవాబివ్వటానికి కెవరికి కాళీ? ఇంకో మూడు రోజులు మేము బొంబాయిలో ఉండవలసివచ్చింది. ఇంత పెద్ద ప్రయాణంచేయటం అసంభవమన్నంతగా వినోద్ నీరసించి పోయారు. నాలుగోనాడు నేనాయనతో 'ఇక్కడకు వద్దా మంటే, నేనక్కడికి వెళ్ళనన్నారు. నేను నచ్చజెప్పినమీదట, ముందు నేనువచ్చి యిక్కడిపరిస్థితి తెలుసుకువచ్చే షరతుమీద ఒప్పుకొన్నారు.'

నా నోట వచ్చింది - 'భగవంతుడా! నేనింత నిర్భాగ్యు రాలినా?'

'నిర్భాగ్యురాలవు కాదమ్మా! కేవలం నీవు వినోద్ నష్టం చేసికోలేదు. నేనొక్కతెను ఇక్కడకురావాలని ఆయన ఉద్దేశం. కాని ఆ పరిస్థితిలో ఆయన్నక్కడ వదలిపెట్టడం మంచి దనిపించలేదునాకు. మొన్న మేమిద్దరం అక్కడనుంచి బయలు దేరాం. ఇక్కడికివచ్చాక వినోద్ 'వెయిటింగు రూమ్'లో ఆగారు. నేను ఎద్రసముగుతూ భువన్ దగ్గఱకి చేరాను. భువన్‌ని నేను బాగా మందలించాను. అత డేడ్చాడు. అతన్ని నీవు బాగా తిట్టావనికూడా నాతో చెప్పాడు. కళ్ళకి మంచివాడుకాడు; గాని మనస్సుమంచిది. అక్కడ నాకు సంతోషంకలిగింది. దారిలో నీతోకలిశాక ఆ ఉన్న కాస్త భ్రమకూడా పోయింది. అటుపైన నేను వినోద్‌ని నీదగ్గఱకి తీసుకువచ్చాను. ఇప్పుడు నీ వస్తువు నీ కప్పజెప్పుతున్నాను. ఈ దుర్ఘటన మళ్ళీఎప్పుడూ ఇటువంటి

లగనివ్వకుండా నిన్ను బాగా మేల్కొలిపిందని నేనాశిస్తు
ఆత్మసమర్పణ చేయటం నేర్చుకో. నీవు సుందరివనే
మరచిపో. ఆనందమయజీవనానికిదే మూలమంత్రం.
న్ను మోసంచేయటంలేదు. కాని తలచుకొంటే ఈ వేళ
ు నీదగ్గఱనుంచి లాక్కుపోగలను. కాని సౌందర్యంలో
కాలిగోటికికూడా పోలను. రూపంతోపాటు సేవాభావం
గలిగితే నీవు అజేయురాలవవుతావు... ... ...'

ు కుసుమ కాళ్ళమీదపడి ఏడుస్తూ అన్నాను. 'సోదరీ!
'కు చేసిన ఉపకారానికి జీవితమున్నంతకాలం ఋణపడి
ను. నీ సహాయమే లేకపోతే ఈ వేళ నా గతేమయ్యేదో!'

! కుసుమ రేపు వెళ్ళిపోతుంది. నాకుమాత్రం ఇప్పు
దేవతలాగ కనిపిస్తోంది అవిడ కాళ్ళకడిగి నెత్తిని పోసు
మనిపిస్తోంది. ఆమె ద్వారా నాకు కేవలం వినోద్
మే లభించలేదు. సేవయొక్క నిజమైన ఆదర్శమేగాక,
నక్క యథార్థమైన కర్తవ్యజ్ఞానముకూడా లభించాయి.
ది నా జీవనంలో నవయుగం ఆరంభమవుతోంది.
భోగవిలాసాలకి ప్రాధాన్యం ఉండదు. సహృదయతకు,
తకు ప్రాధాన్యంఉంటుంది.

నీ పద్మ

* * *

ఇవి ఆంగ్ల, ఫ్రెంచి సాహిత్యసారాల్ని పాఠకులకు అంది స్తున్నాయి. క్లాసులైబ్రరీలకు, పబ్లికు లైబ్రరీలకు, నవలాపాఠకుల ఎంతో ఉపయోగకరమైనవి.

| | | | |
|---|---|---|---|
| డేవిడ్ కాపర్‌ఫీల్డు | 0 8 0 | టాలిస్‌మన్ | 0 |
| పెలబాల | 0 8 0 | క్వెంటిన్ డర్వార్డ్ | 0 |
| రెండు నగరాలు * | 0 8 0 | కెనిల్వర్తు | 0 1 |
| బంగారుదీవి | 0 8 0 | ఆలివరు ట్విస్టు | 0 1 |
| డేవిడ్ బాల్ఫర్ | 0 10 0 | నికొలసు నిక్లబి | 0 1 |
| కేట్రియోనా | 0 10 0 | ఆశాసౌధములు | 0 1 |
| ముగ్గురు యోధులు | 0 10 0 | అంకుల్ టామ్స్ కేబిన్ | 0 8 |
| నల్ల తులీపు | 0 10 0 | డాక్టర్ జెకిల్ ఎండ్ - | |
| మాంటి క్రిస్టో | 0 10 0 | మిస్టర్ హైడ్ | 0 |
| డికెన్సు కథలు | 1- 8-0 | స్టీవెన్సన్ కథలు | 1. |
| మ్యూపాసా కథలు | 1-12-0 | స్కాట్ కథలు | 1-12-0 |
| డాక్టర్ అండ్ అంకుల్ | 1- 0-0 | ప్రపంచవాణి | - 0- |

# ఆంధ్రసాహిత్యము

| | | | |
|---|---|---|---|
| నీతికథాంజలి | | వీరభారతి | 0 10 |
| మొదటిభాగము | 0 4 0 | వీరబల వినోదకథలు | 0 10 0 |
| ,, రెండవ భాగము | 0 5 0 | నీతికథామంజరి | 0 5 0 |
| ,, మూడవభాగము | 0 7 0 | భక్తకథామంజరి | 0 |
| ,, నాల్గవ భాగము | 0 8 0 | బాలధ్రువ చరిత్ర | |
| ,, ఐదవ భాగము | 0 10 0 | బాలకుశలవ చరిత్ర | |
| ,, ఆరవ భాగము | 0 12 0 | హనుమంతుడు | |
| ,, ఏడవ భాగము | 0 12 0 | వామన | |

## మారుతిరామా అండ్ కో., విజయవాడ

విద్యావిషయక ప్రచారకులు